# ఆంధ్ర నాట్యం

(పరిశోధన)

ఆంధ్రరత్న, భరతకళాప్రపూర్ణ

**డాక్టర్ నటరాజ రామకృష్ణ**

**పేరిణీ ఇంటర్నేషనల్**

అశోక్‌నగర్, హైదరాబాదు

ప్రథమ ముద్రణ : సెప్టెంబర్ 1987

ప్రతులు : 2000



చిత్ర కారుడు : శ్రీ కనక సూరిబాబు

ప్రతులకు : విశాలాంధ్ర బుక్‌హౌస్
బ్యాంక్ స్ట్రీటు, హైదరాబాదు-500 001.

ముద్రణ : శ్రీ తిరుమల ప్రింటర్స్,
ముషీరాబాదు, హైదరాబాదు-500 020.
ఫోన్ : 6 2 9 3 9

ప్రచురణ : పేరిణీ ఇంటర్‌నేషనల్,
అశోక్‌నగర్, హైదరాబాదు-500 020.

వెల : రూ॥ 15-

విదేశాల వెల : 3 $

# మొట్టమొదటి మాట

నాకు ఊహ వచ్చినప్పటినుండీ అంబను ఆరాధించాను. కళాసరస్వతిని కన్నతల్లిగా కొలిచాను. నా మాతృ హృదయాన్ని సంపూర్ణంగా తెలిసికొనడానికి ఆరాటపడ్డాను, తపించాను. తపించి, తపించి సాధించి తరించాను. నా తపః ఫలితాన్ని ఆంధ్ర జాతికి అర్పిస్తున్నాను.

నేను సాధించింది అత్యల్పం. సాధించవలసింది ఇంకా ఎంత ఉందో చెప్పలేను. ఇకమీదట దీనిని సాధించవలసింది యువతరం. ఈ బరువు బాధ్యతలను, వారికి అప్పగిస్తున్నాను. ఎవరో ఒకరు సాధించగల రన్న విశ్వాసం నా కుంది. అదే నా ఆశ.

చదువుల తల్లి బాసర జ్ఞాన సరస్వతి సేవలో

మీ

—నటరాజ రామకృష్ణ

# ఆంధ్రుల నృత్యకళ

శ్లో॥ మహేంద్రో మలయః సహ్యోమేకలః పాలమంజరః
ఏతేషు సంశ్రితా దేశాస్తే జ్ఞేయా దక్షిణా పథాః
కౌసల్యాస్తో శలాశ్చైవ కలింగా యవనాః ఖసాః
ద్రవిడాంధ్ర మహారాష్ట్రా వైణ్ణా వైశానవాసజాః
దక్షిణస్య సముద్రస్య తథా వింధ్యస చాంతరేః
యేదేశాస్తే పయుంజీత దాక్షిణాత్యాంతు నిత్యశః

(భరతుని నాట్యశాస్త్రము)

మహేంద్ర మలయాది పర్వతాలు గల దేశానికి దక్షిణాపథ మని పేరు. ఈ దక్షిణాపథంలో ఆంధ్ర, ద్రావిడ, మహారాష్ట్రాది ప్రాంతాలు ఉన్నాయి. దీనికి ఉత్తరాన వింధ్య పర్వతాలు. దక్షిణాన సముద్రం హద్దులుగా ఉన్నాయి. అటువంటి దక్షిణ భారతము నందలి ప్రజలు పలు విధములైన నృత్య, గీత, వాయిద్యాలతో దాక్షిణాత్యమని ప్రసిద్ధి గాంచిన కైశికి వృత్తి యందు నాట్యము చేస్తారు. ఈ శ్లోకంలోని "వైణ్ణా" అనే పదమునకు "కృష్ణవేణి పెన్నానది తీరవాసు"లని అభినవ గుప్తాచార్యుడు వ్యాఖ్యానించాడు. ఈ దేశమంతా ఆంధ్ర దేశంలో ఉన్నది.

# జక్కుల పురంధ్రి

సీ॥ కోణాగ్ర సంఘర్ష ఘుమ ఘుమ ధ్వని
తారకంఠ స్వరంబుతో గారవింప
మసిబొట్టు బోనాన నసలు కొల్పిన కన్ను
కొడుపుచే దాటించు నెడపదడప
శ్రుతికి నుత్కర్షంబు జూపంగా వలయిచో
జెవిత్రాడు బిగియించు జీవగట్టి
గిల్కు గిల్కున మ్రోయు కింకిణి గుచ్ఛంబు
తాళ మానంబుతో మేళవింప

తే॥ రాగమున నుండి లంఘించు రాగమునకు
నుర మయూర ద్వయంబుపై నొత్తిగిల్లి
కామవల్లీ మహాలక్ష్మి కైటభారి
వలపు నాడుచు వచ్చె జక్కుల పురంధ్రి

(క్రీడాభిరామము)

## ఆంధ్ర దేశం - శాస్త్రీయ నృత్యకళ

- నట్టువ మేళం (స్త్రీల నర్తన రీతి) ఆంధ్ర | నాట్యం
  - ఆలయ సంప్రదాయం (ఆగమ నర్తనాలు) (శైవ, వైష్ణవ రీతులు)
    - తాండవం
      - నృత్తం
  - కచేరి సంప్రదాయం, కర్నాటకం
    - నృత్యం
  - భాగవతం (పారిజాతం, నవజనార్దనం)
    - లాస్యం
      - అభినయం
- నాట్య మేళం (పురుషుల నర్తన రీతి)
  - యక్షగానం
  - వీధి నాటకం
  - వీధి భాగవతం (వీధి భాగవతం, భామా కలాపం, గొల్ల కలాపం, దాసరమ్మ, పగటి వేషాలు మొ॥)

## ఆంధ్ర దేశం - నర్తన రీతులు



# ఆంధ్ర నాట్య విషయ వివరణ

**ఆంధ్రి** : ఆంధ్రులు జాతీయ సంగీతానికి సమకూర్చిన ఒక రాగం మాలపపంక రాగంలోని ఆరు రాగిణులలో ఇది యొకటి.

**ఎరుకల కాంభోజి** : త్రిలింగ దేశంలోని ఎరుకుల తెగవారి అభిమాన రాగం. దీన్నే యెదుకల కాంభోజి అని కూడా అంటారు.

**తిలంగ్** : ఉత్తరాది సంగీతానికి తెలుగువారు కానుకగా సమర్పించిన ఒక రాగం.

**యక్షగానం**: యక్షులు ఆరాధించిన ఒక కథాగాన శైలి. యక్షులు, నాగాసులు, కూర్మాపులు, భోగాలు, సానులు అనే అయిదు గంధర్వ తెగలవారు ఆంధ్రదేశంలో అనాదనుండి గంధర్వ విద్యలను ఆరాధిస్తూ వచ్చారు. దేవాలయాల్లో నృత్యగాన కేళికలను సానులు చేస్తూ వచ్చారు. వీరినే దేవనర్తకు లన్నారు. యక్షులే జక్కులైనారు ఈ యక్షులు ప్రదర్శించిన కథా గాన మే యక్షగాన మయింది ఇదొక ప్రత్యేక ప్రాచీన దేశి ఏకపాత్ర నృత్య సంప్రదాయం.

**వీధినాటకం**: బహు పాత్రలతో గూడిన నాటక శైలి.

**వీధి భాగవతం** : దేశి, మార్గ పద్ధతులపై ఆధారపడి రూపొందిన నృత్య నాటక రీతి. ఏకపాత్ర సంప్రదాయం గలది.

**నట్టువ మేళం** : లాస్యనర్తన కేళికలు చేసే స్త్రీల బృందం. ఏక పాత్ర నర్తనం.

**నాట్య మేళం** : స్త్రీ పాత్రలను గూడ పురుషులే ధరించి నర్తమాడే బృందం. బహు పాత్రల నృత్య నాటకం.

**మేళం** : నర్తకులు, సూత్రధారుడు మృదంగం, వేణువు మొదలైన వాయిద్యకులు, తాళధారులు, పాటకులు మొదలైన వారు గల స్త్రీ, పురుషుల బృందం.

**లాస్యం** : సుకుమారమైన అభినయ నర్తన రీతి.

**తాండవం** : గంభీరమైన భావ ప్రకటన గల ఉద్ధతమైన నర్తన శైలి.

**కలాపం** : ఒకానొక సంగీత ప్రబంధాన్ని ఒకే నర్తకి ఆటపాటల ద్వారా ప్రదర్శించే నర్తన రీతి.

**జాయప సేనాని** : గణపతి దేవుని గజసేనాపతి-నృత్తరత్నావళి, గీత రత్నావళి, వాద్యరత్నావళి గ్రంథాలను రచించాడు. ఇతని గురువులు గండయామాత్యులు, సూరయామాత్యులు.

**విద్యా నాథుడు** : ప్రతాపరుద్రీయం అనే అలంకార శాస్త్రాన్ని రచించాడు. ప్రతాపరుద్రుని ఆస్థానకవి, అలంకార శాస్త్రవేత్త.

**ప్రభు కొమరగిరి** : వసంతరాజీయ మనే నాట్య శాస్త్రాన్ని రచించాడు.

**రంజకం కుప్పాయి** : విజయనగర మహారాజుల ఆస్థాన నర్తకి. విద్యస్సభారాయ రంజక బిరుదాంకితుడైన రంజకం శ్రీరంగరాజు కుమార్తె. ఈమె కుమార్తెలు ముద్దు కుప్పాయి, తిరుమలమ్మ.

**పాల్కురికి సోమనాథుడు** : దేశి, మార్గ నృత్యాలను తన గ్రంథాలలో వర్ణించాడు.

**శ్రీనాథుడు** : తన కావ్యాలలో వివిధ నృత్యాలను వర్ణించాడు.

నాయకరాజులు :

రఘునాథ నాయకుడు : నృత్య కళా పోషకుడు, ముద్దు చంద్రరేఖ శశిరేఖ, కృష్ణాజీ, మదనరేఖ, మధురవాణి మొదలైన నృత్య కోవిదులను పోషించినవాడు

అచ్యుతప్ప: నాట్య కళా పోషకుడు. తన పేరిట అచ్యుతాపురమనే ఒక గ్రామాన్ని బ్రాహ్మణ భాగవతులకు దానమిచ్చాడు. అదే నేటి మేలటూరు. అంటే మేళాలు ఉండే ఊరు.

విజయ రాఘవ నాయకుడు యక్షగానాలను రచించాడు.

మహారాష్ట్ర ప్రభువులు : నాయక రాజుల తర్వాత తంజావూరు నేలిన ప్రభువులు. దర్బారు కేళికను అభివృద్ధి పరచినవారు. వీరి ఆస్థానంలో చిన్నయ్య, పొన్నయ్య, వడివేలు, శివానందం అనే సోదరులు నాట్య శాస్త్ర వేత్తలుగా ఉండేవారు.

శరభోజి : బహుముఖ నాట్య శాస్త్ర వేత్త, యక్షగాన రచయిత సంగీత ప్రబంధాలను రచించాడు.

ఖండోజి : విచిత్రరాయవతంస కవి, నాట్య శాస్త్ర రచయిత.

వేంకట రామశాస్త్రి : యక్ష గానాల రచయిత, ప్రదర్శకుడు.

ఆంధ్ర నాట్యానికి ఆధార గ్రంథాలు : భరతుని నాట్యశాస్త్రం, నందికేశుని అభినయ దర్పణం భరతార్ణవం, (నంది కేశుడు తెలుగు వాడని పండితుల అభిప్రాయం), భరతసార సంగ్రహం, భరత కల్ప లతా మంజరి, ప్రతాప రుద్రీయం, రస మంజరి, రస ప్రకరణం మొదలైన గ్రంథాలు.

నాట్యమేళాల వారు: కూచిపూడి బ్రాహ్మణ భాగవతులు, కోటకొండ బ్రాహ్మణ భాగవతులు, పొతకమూరు వైష్ణవ భాగవతులు, జంగం బలిజ, ఎర్రగొల్ల, దాసరి భాగవతులు, సైంధవులు, భరతులు, బహురూపులు, యానాది భాగవతులు, చిలకల భాగవతులు, బవనీలు, ఉగ్గు గొల్లలు, చిందు మాదిగలు, పిచ్చుక కుంట్ల వారు, కురుమ వారు, చెంచులు, నక్కల వారు.

పారిజాతాలు కలాపాలు: భామా కలాపం, గొల్ల కలాపం, చోడిగాని కలాపం, ఎరుకల వేష కథ, సుంకరి కొండయ్య కలాపం, జీవ యెరుకల కురవంజి, నవజనార్దన పారిజాతం. నవజనార్దన పారిజాతం ప్రసిద్ధమైంది.

క్షేత్రయ్య : పదకర్త, సాత్వికాభినయానికి తగిన అనేక పదాలను రచించాడు.

సిద్ధేంద్రుడు: భామా కలాపం రచించాడు.

నారాయణ తీర్థులు : కృష్ణా లీలా తరంగణి యక్షగాన రచయిత.

తరికొండ వెంకమాంబ : గొల్ల కలాపం రచయిత్రి.

మేళప్రాప్తి: సకల వాయిద్యాలను సమస్థాయిలో పూరించి వాయించడం.

జడ : సత్యభామ జడ. భామా కలాప ప్రదర్శనలో సభను సవాలు చేస్తూ భామ పాత్రధారుడు తెరపైని జడవేయడం ఆచారంగా ఉండేది. అతడు ఓడి పోతే ఆ జడను కత్తిరించేసేవారు.

హాస్య పాత్రలు : వీధి నాటకాలలో సింగి, సింగడు, చోడిగాడు, ఎరుకల సాని. తోలు బొమ్మలాటలో జుట్టు పోలిగాడు, కేతిగాడు, గంధోళి గాడు, బంగారక్క.

గొండ్లి : రాజ గోండుల ఆస్థాన నర్తన రీతి.

కేళిక : నృత్త, నృత్య, అభినయాలతో గూడిన ఏకపాత్ర నాట్య ప్రదర్శన.

నృత్తం : అడుగులు, అడవులు ప్రాధాన్యత వహించే నాట్యం. స్వర పల్లవులు, శబ్ద పల్లవులు, సాహిత్య పల్లవులు, జతి స్వరాలు, జాతి స్వరాలు, తిల్లానాలు, గీత ప్రబంధాలు మొదలైనవి నృత్తానికి అనువైనవి.

నృత్యం : ఆంగికాభినయంతో గూడిన నాట్యం. తరంగాలు, ఆధ్యాత్మ రామాయణ కీర్తనలు శబ్దాలు, సలాం జతులు, జక్కిణి దరువులు, పద దరువులు, స్వరజతులు, తాన వర్ణాలు, పద వర్ణాలు, పెద్ద వర్ణాలు, దరువులు, అష్ట పదులు, అష్టకాలు, కైవారాలు కౌతాలు గీతాలు మొదలైనవి దీనికి అనువైనవి.

అభినయం : ముఖరాగంతో భావాన్ని తెలియజేయడం. శ్లోకాలు, పద్యాలు, పదాలు, జావళీలు, గీతాలు దీనికి అనువైనవి.

పదం : నాయకి తన భావాన్ని ప్రదర్శించడానికి వీలయిన సంగీత రచన. క్షేత్రయ్య సభాపతయ్య, సారంగపాణి మొదలైనవారు రచించిన పదాలు అభినయానికి చాలా అనువైనవి. త్రిపుట తాళంలో రచించబడిన పదాలు ప్రాముఖ్యత వహిస్తాయి.

## ప్రముఖ పద కర్తలు - వారి ముద్రలు

క్షేత్రయ్య - మువ్వ గోపాల

సభాపతయ్య - రాజ గోపాల

సారంగపాణి - వేణు గోపాల

యువరంగడు - యువరంగ

అన్నమాచార్య - శ్రీ వేంకటేశ్వర వేంకటాచలపతీ

ఘటపల్లి వారు - కైలాసపతి

జటపల్లి వారు - జటపల్లి గోపాల

బొల్లాపురం వారు - బొల్లవరం

శోభనగిరి - శోభనగిరి

మల్లికార్జున - మల్లికార్జున కృష్ణ

వినుకొండ వారు - వినుకొండ విజయరామ.

వేనంగి వారు - వేనంగి

వీరభద్రయ్య - వరద వేంకటేశ్వర

మాతృబుద్ధేశ్వర - దామెరకుమార వేంకటభూపాల

సీనయ్య - మన్నారు రంగ

కస్తూరి రంగ - కస్తూరి రంగ

పరిమళరంగ - పరిమళ రంగ

వేంకటరామశాస్త్రి - మలజేంద్ర

## పదాలకు అనువైన రాగాలు, తాళాలు

కాంభోజి, యెరుకల కాంభోజి, గుమ్మ కాంభోజి, శంకరాభరణం, తోడి, సురట, భైరవి, శహన, బేగడ, అఠాణా, మోహన, కళ్యాణి, కేదారగౌళ, కేదార, నీలాంబరి, ఆహిరి, భూపాల, ఘంట, నాట, పున్నాగవరాళి, వరాళి, నాదనామక్రియ, అసావేరి, సావేరి, సౌరాష్ట్రి, ఆనందభైరవి, గౌరి, కురంజి, కాఫి, కామవర్ధని, సైంధవి, ధన్యాసి, శ్రీరాగం, పంతువరాళి, బిలహరి, మూలవశ్రీ, పూర్వి, కానడ మొదలైన రాగాలు.

త్రిపుట, ఆది, రూపకం, ఝంపె, ఏక, అట, చాపు మొదలైన తాళాలు.

ఆంధ్రనాట్యంలో ఉపయోగించే రాగాలు తాళాలు, భాగవతాలలో ఉపయోగించే రాగాలు, తాళాలు ఒకటే అయినా వాటి ప్రయోగాలలో భేదముంటుంది.

# మొదటి అట్టలోపలి చిత్రపటాల వివరణ

ఆంధ్రప్రదేశ్‌లోని 23 జిల్లాలలోను ప్రచార మందుండిన ఆగమాది శాస్త్రీయ సాంప్రదాయక ప్రజా నర్తనాల వివరణ.

అందాలరాసులైన అమర ఆంధ్ర నర్తకులు తమ పాదాలను పసుపు పారాణితో అలంకరించుకొని, స్వర్ణ మంజీరాలను భావయుక్తంగా పలికిస్తూ ఆలయాలలో, ఆరామాలలో, రాజాస్థానాలలో, పండిత సభల్లో, సామాన్య ప్రజల సమక్షంలో ప్రబోధాత్మకంగా నర్తనాన్ని మూడు విధాలుగా గత రెండువేల సంవత్సరాలుగా ప్రదర్శిస్తూ వచ్చారు. ఆ మూడు విధాలైన నర్తన రీతులను ఈ అట్ట లోపలి చిత్రపటాలలో చూడవచ్చును.

ఆలయంలో ఉదయం స్వామిని పాటలతో మేల్కొలిపి, మళ్లారాత్రి ఆ స్వామిని నిద్రబుచ్చి, దిక్పాలకులకు ఆ యాలయాన్ని అప్పగించే ప్రహరీ నర్తనం వరకు గల వివిధ నర్తనాలు ఈ చిత్రాలలో చిత్రీకరింపబడ్డాయి. ఇవి ఆగమ పద్ధతికి చెందినవి. ఇది మొదటి రీతి.

ప్రజలను పాలించే ప్రభువుల ఆనందంకోసం ప్రదర్శింపబడిన నృత్త, నృత్య, అభినయాలతో గూడిన నర్తనం రెండవ రీతి.

వినోదం ద్వారా ప్రజలలో ఆధ్యాత్మిక చింతనను కలుగజేసే పారిజాత, కలాపాది నర్తనాలు మూడవ రీతికి చెందుతాయి.

ఏ యే జిల్లాలలో ఏ యే నర్తనాలు ప్రధానంగా ప్రదర్శింపబడేవో జిల్లాల వారిగా మీకు క్లుప్తంగా తెలియజేస్తాను.

| | |
|---|---|
| 1. శ్రీకాకుళం<br>2. విజయనగరం<br>3. విశాఖపట్నం | : ఆలయ ఆగమ రీతి, కేళికా రీతి భాగవత కళా రీతి ఈ మూడు ఈ జిల్లాలలో ప్రచారంలో ఉండినా ఆస్థాన, భాగవత రీతులు ఎక్కువ ప్రాముఖ్యాన్ని వహించాయి. |
| 4. తూర్పు గోదావరి<br>5. పశ్చిమ గోదావరి | : ఆలయ సాంప్రదాయక నృత్యాలు పారిజాత కలాపాలు, సాత్వికాభినయం. వీటిలో సాత్వికాభినయం, ప్రఖ్యాత మయింది. |
| 6. కృష్ణ<br>7. గుంటూరు<br>8. ప్రకాశం<br>9. నెల్లూరు | : కూచిపూడి భాగవతం, ఆలయ ఆస్థాన, నర్తన రీతులు. |
| 10. కడప<br>11. చిత్తూరు<br>12. అనంతపురం<br>13. కర్నూలు | : ఆలయ సాంప్రదాయక నర్తనం, ఆస్థాన కేళిక, ప్రఖ్యాత కుప్పం వీధి నాటక బాణీలు. |
| 14. ఖమ్మం<br>15. నల్గొండ<br>16. వరంగల్ | : పూర్వంముండిన ఆలయ నర్తన రీతులు ఇక్కడ పూర్తిగా అంతరించి పోయాయి. గాని ప్రాచీన కాలంలో విశిష్టత గాంచిన నృత్య శిల్ప ఖండాలు మాత్రం కొన్ని దేవాలయాలలో మిగిలియున్నాయి. |
| 17. మహబూబ్‌నగర్ | : ఆస్థాన కేళికా రీతి. ఆలయ నర్తన రీతి. ప్రస్తుతం యక్షగాన ప్రదర్శనలు |

| | | |
|---|---|---|
| | | ఉన్నాయి. రెండంతస్థుల రంగస్థలం మీద నృత్య నాటకాలను ప్రదర్శించే పద్ధతి ప్రస్తుతం ఇక్కడే ఉంది. |
| 18. హైదరాబాదు<br>19. రంగారెడ్డి | : | ప్రాచీన కాలంలో ఆలయ నర్తన సంప్రదాయం, దర్బారు ఆట. ప్రస్తుతం కథక్, భరతనాట్యం, ఆంధ్రనాట్యం, జానపద నృత్యాలు మొదలైన పన్నీ ఈ ఆంధ్ర ప్రదేశ్ రాజధానిలో ఉన్నాయి. |
| 20. నిజామాబాద్ | : | ప్రాచీన కాలంలో ఆలయ నర్తన రీతి. ప్రస్తుతం హిందూస్థానీ, మరాఠీ బాణీ నర్తనాలు, యక్షగానం. |
| 21. మెదక్ | : | భాగపతాది ప్రదర్శనలు. గంటె, చిందు భాగవతులు ప్రసిద్ధులు. |
| 22. కరీంనగర్ | : | ప్రాచీన కాలంలో ఆలయ నృత్యాలు. ప్రస్తుతం భాగపతాలు చిందు భాగవతులు చిలుకల భాగపతులు ప్రసిద్ధులు. |
| 23. ఆదిలాబాదు | : | గిరిజన నృత్యాలు. |

## ఆంధ్రనాట్యానికి ఉపయోగపడే వాద్యాలు

కంచుతాళాలు, గంటలు, మృదంగం, శుద్ధమద్దెల, చండవాద్యం, వీణ, వేణువు, వాయులీనం ముఖవీణ, శంఖం, ఆలయాల్లో భేరి, నగారా, టక్కా, టమరం, శృంగభేరి, సూర్యమండలం, పంచముఖ వాయిద్యం, త్రిముఖవాయిద్యం, స్వరఘటం, మొదలైన వాటిని ప్రత్యేకంగా పైవాటితో కలిపి వాయించేవారు.

గజ్జెలు : చక్కని నాదం గల గజ్జెలు ఆంధ్రనాట్యానికి జీవంపోస్తాయి. తాడుతో అల్లిన గజ్జెలనే ధరించాలి. తోలుకు కుట్టిన గజ్జెలు పనికిరావు. గజ్జెలను ధరించిన నర్తకి సరస్వతితో సమానం. కనుక గజ్జెలు కట్టుకొన్న తర్వాత ఎవరికీ నమస్కరించ కూడదు.

# చివరి అట్ట లోపలి చిత్ర పటాల వివరణ

మన సంస్కృతిని ప్రజల్లో ప్రచారం చేయడానికి నృత్య కళాకారులు ప్రదర్శించే యక్షగానం, వీధినాటకం, భాగవత బాణీలే కాక ప్రజలు తమ వినోదం కోసం ప్రదర్శించుకొనే జానపద నర్తనాలే కాక గిరిజనులు తమ వినోదార్థం ప్రదర్శించుకొనే నృత్యాల గురించి కూడ ఈ చిత్రాలలో వివరించబడింది.

ఆంధ్రప్రదేశ్‌లోని ఇరవై మూడు జిల్లాలలో ప్రచారమందున్న సామూహిక గొబ్బి, కుమ్మి, బతకమ్మ, కోలాట నర్తనాలను స్త్రీలు ప్రదర్శిస్తూ ఉంటారు. వీటిలో బతకమ్మ, గొబ్బి ఆటలను పార్వతీదేవి ప్రీతి కొరకు చేస్తారు. ప్రజల వినోదార్థం ప్రదర్శింపబడే ప్రసిద్ధ జానపద నర్తనాలు, కోలాటం, జంగంకథ, బుర్రకథ, పిచ్చుకగుంట్ల, శారదగాండ్ర కథాగానం, బవనీలు, ఒగ్గు గొల్లల కథా గానం మొదలైనవి. సింహాద్రి అప్పన్న సేవ, తప్పెగుండ్లు, తూర్పు జిల్లాలైన శ్రీకాకుళం, విజయనగరం, విశాఖ జిల్లాలలో ప్రత్యేకంగా ప్రసిద్ధమైనవి. డప్పుల నృత్యం ఆంధ్రప్రదేశ్ అంతటా ఉంది. తెలంగాణాలో ప్రత్యేకంగా చెప్పుకో దగ్గది జోగాట. ఒకప్పుడు ఆంధ్రప్రదేశ్ అంతటా ప్రఖ్యాతి గాంచిన తోలు బొమ్మలాట ప్రస్తుతం మరుగున పడుతూంది. వీర శైవం ప్రబలంగా నుండిన ప్రాంతాలలో, ముఖ్యంగా ఉభయ గోదావరి, గుంటూరు జిల్లాలలో ప్రభల వీర నాట్యం ప్రసిద్ధంగా ఉంది.

రాయలసీమలోని కొన్ని ప్రాంతాలలో మాత్రమే కీలు గుర్రాల ఆట ప్రస్తుతం ఉంది. గుర్రం ఆట ప్రస్తుతం ఒక్క గుంటూరు జిల్లాలో మాత్రం ఉంది.

గిరిజన నృత్యాలను ప్రదర్శించే కొమ్ము లంబాడీలు ఆదిలాబాదు అరణ్య ప్రాంతాలలో మాత్రమే ఉన్నారు. లంబాడా, సుగాళీ, బంజారాలు ఆంధ్రప్రదేశ్ అంతటా ఉన్నా ఖమ్మం జిల్లాలో వీరు అధికంగా ఉన్నారు. తూర్పు గోదావరి జిల్లాలో కోయవారున్నారు చెంచులు కర్నూలు జిల్లాలో ఉన్నారు. శ్రీకాకుళం, విజయనగరం, విశాఖ జిల్లాలలో సవరలు, గదబలు ఉన్నారు.

పై గిరిజనుల నర్తనాల గురించి వివరంగా తెలుసుకొనదలెనంటే నేను రచించిన "ఆంధ్రనాట్యం - జానపద, గిరిజన నర్తనాలు" అనే చిన్న పుస్తకాన్ని చదవండి.

# నేనం

నా దేశం : కాళేశ్వరుడు, శ్రీశైల మల్లికార్జునుడు, ద్రాక్షారామ భీమేశుడు, ఈ త్రిమూర్తులు వెలిసిన పుణ్యభూమి త్రిలింగ దేశం.

వేదవచనం : నా ఋషి : ఆది భిక్షువు, నటమహానటుడు, నటరాజ మూర్తి.

నా దేవత : అన్నపూర్ణ, విశాలాక్షి, అంబ, జగదంబ.

నా ఛందస్సు : నవనాడులు, సంకీర్ణ మేళవింపు.

నా భాష : కోటి వీణల సామగానసారం ఆంధ్రం, మధురం మధురం అతి మధురం ఆంధ్ర మంటే అత్యంత మధురం.

నా సీమ : జిలుగు వెలుగుల రంగవల్లి సాగరసీమ, రత్నగర్భ రాయల సీమ, తేనె మాగణి తెలంగాణ సీమ.

గాంధర్వం : యక్షుల విహార భూమి, నాగుల నర్తన భూమి.

# విన్నపం

ఆంధ్రులది రెండు వేల సంవత్సరాల సంస్కృతి. తెనుంగులు భారతమాత మణిమయ మకుటానికి సమకూర్చిన అమూల్యమైన కళా రత్నాలగురించి లోకానికి తెలియదు భారతమాత కంఠమాలలో ఎన్ని ఆంధ్రరత్నాలున్నాయో మన భారతీయులకే కాదు మన ఆంధ్రులకే తెలియదు.

ఆంధ్ర యువ కళాకారులారా! మీ పరిశోధనల ద్వారా, మీ ప్రవచనాలద్వారా. మీ రచనల ద్వారా, మీ ప్రదర్శనల ద్వారా, ప్రచారచేస్తూ ఆంధ్రుల విశిష్టతను విశ్వానికి తెలియజేయండి.

తెలుగు తల్లి మనలను కని, పెంచి, పోషించి, పెద్ద జేసినందుకు ఆ తల్లి ఋణం తీర్చుకొనడం మన విధి.

ఆంధ్రుల సంస్కృతిని, కళా చరిత్రను లోకానికి తెలియజేయాలన్న ఆశయంతో చిన్ని, చిన్ని గ్రంథాలు పం ది టి ని నేను వ్రాసి మీకు అందించాను. వీటికి నాందిగా ఈ "ఆంధ్ర నాట్యం-పరిశోధన- పరిచయం" మీకు సహాయ పడగలదు. ఆంధ్రుల నాట్యకళను గురించి పరిశోధనను కొనసాగించండి. "ఆంధ్ర నాట్యా"న్ని వెలుగులోకి తీసుకురండి.

—నటరాజ రామకృష్ణ

# మొదటి మాట

ఆంధ్రుల కళా సంస్కృతుల గురించి పరిశోధించవలసిన ప్రాంతాలూ, విషయాలగురించి ముందుగా ముచ్చటిస్తాను.

తైలంగులనే ఒక ప్రాచీన తెగవారు బర్మాదేశంలో ఉన్నారు. ఒక శతాబ్ది కితం తెలుగునాడునుండి బర్మా వెళ్లి అక్కడ స్థిరపడిన తెలుగువారు కారు వీరు. ప్రాచీన కాలంలో అంటే ఎన్నో శతాబ్దుల క్రితం తెలుగు దేశంలోని ఏదో ప్రాంతంనుండి బర్మా వెళ్లి, అక్కడ స్థిరనివాసం ఏర్పరచుకొన్న తెలుగు వారై యుంటారు వీరు వీరి మాతృభాషైన తెలుగులో ఎన్నో మార్పులు వచ్చి అదొక కొత్త భాషగా రూపొందినా వీరి ఆచారవ్యవహారాలలో ఇంకా తెలుగు వారి ప్రాచీన సంప్రదాయాలు ఈనాటికీ గోచరిస్తున్నాయి. ఇతరత్రా వీరు బర్మాదేశస్థులలో కలిసిపోయి వారి ఆచారవ్యవహారాలను పాటిస్తూ, బర్మా భాషను మాట్లాడుతూ అసలైన బర్మావారిలాగే కనబడుతున్నారు. అయినా తైలంగులనే ఒక ప్రత్యేక తెగగా వీరు పరిగణింపబడుతున్నారు. వీరి ఆరాధనా పద్ధతులను, ఆచారవ్యవహారాలను సంగీత, నృత్యరీతులను, వీరు ఇంటిపద్ద మాట్లాడే భాషను ఎవరైనా ఓపికతో పరిశీలించి, పరిశోధించ కలిగితే ప్రాచీన ఆంధ్రజాతికి సంబంధించిన విషయాలెన్నో మనకు తెలియగలవు.

ఎండాకాలంలో నదులు ఎండిపోతాయి. వర్షాకాలంలో కొత్తనీరు వచ్చి, పాతనీటితో కలిసి ప్రవహిస్తుంది. ఆ కొత్త ప్రవాహంలో పాతవి ఎన్నో కొట్టుకుపోతూ ఉంటాయి. అలాగే కాలప్రవాహంలో ఎన్నో మార్పులు, చేర్పులు వస్తూ పోతూ ఉంటాయి. ఈ కాల ప్రవాహంలో ఏనాడో కొట్టుకుపోయిన ఈ తైలంగులు బర్మాలో తేలారు అని నాకు అనిపిస్తుంది.

వీరు బర్మా ఎప్పుడు వెళ్లారో చెప్పడం కష్టం. తెలుగునాట ఆనాడు ఆధ్యాత్మిక, రాజకీయ, సాంఘిక పరిస్థితులు ఎలా ఉండేవో ఊహించడం కష్టం. ఆనాటినుండి ఈనాటివరకు మన తెలుగు జాతిలో ఎన్నో మార్పులు వచ్చాయి. అందువల్ల వీరిని గురించి పరిశోధించ గలిగితే వీరిలో ఇంకా మిగిలియున్న ఆనాటి మన జాతి సంస్కృతిలోని మూల విషయాలు మనకు తెలియగలవు.

ఇలాగే మహారాష్ట్రలో దేశస్థ బ్రాహ్మణు లున్నారు. ఒకానొకప్పుడు వీరు తెలుగువారే. కాని వీరు తెలుగు భాషను మరిచిపోయారు. అయినా మన తెలుగు సంప్రదాయాలను, ఆచారవ్యవహారాలను నేటికీ వీరు పాటిస్తున్నారు. వర్ఝులవారు, లాంజివారు ధూపల్లివారు, కన్నమ్మవారు మొదలైన ఇంటిపేర్లు గలవారు నేడు అక్కడ వారెందరో ఉన్నారు. వీరు నేడు మరాఠీభాషను వారి మాతృభాషగా చేసుకొని మాట్లాడుతున్నా ఒకప్పుడు వీరంతా తెలుగువారే. జాతిని భాష సూచించదు. వీరు తెలుగునాడు నుండి ఎప్పుడు మహారాష్ట్రదేశం వెళ్లి స్థిరపడ్డారో చెప్పడం కష్టం.

మహారాష్ట్రలో "పైఠాన్" అనే గ్రామ మొకటి ఉంది. శాతవాహనుల కాలంలో ప్రతిష్ఠాన పురంగా ఇది గొప్ప కీర్తి వహించిన నగరం. ధరణికోట, కొండాపురం, ప్రతిపాలపురం మొదలైన పురవాసులతో ఈ ప్రతిష్టానపుర వాసులకు సంబంధబాంధవ్యాలు ఉండేవి. వీరిని పరిశీలించి, పరిశోధిస్తే మన ప్రాచీన నృత్య, సంగీత, శిల్ప, కవిత్వాది కళలగురించే కాక మన ప్రాచీన సాంఘికాది విషయాలగురించి కూడా తెలియగలదు. ఈ పరిశోధనలలో గుణాఢ్యుని బృహత్కథ రచింపబడిన పైశాచిభాష, దాని స్వరూపం, వ్యాకరణం ఛందస్సుకు నేటి మరాఠీ, తెలుగు భాషలకు గల సంబంధాలను గూడ పరిశీలించ వచ్చును.

కళింగ యుద్ధంలో మన తెలుగువారు అశోకుని ఎదిరించి, పోరాడక పోయి యుంటే అతడు బౌద్ధ మతాన్ని స్వీకరించి యుండేవాడు కాదు, బౌద్ధ మతం విశ్వవ్యాప్తం అయ్యేది కాదు.

శ్రీరామచంద్రుడు అయోధ్యలో జన్మించినా రామ కథకు, రామాయణానికి ఆంధ్ర దేశంలో నున్నంత ప్రజాదరణ భారతదేశంలోని మరి ఏ ప్రాంతంలోనూ లేదు. ఇలాగే బుద్ధునికి బుద్ధగయలో జ్ఞానోదయం కలిగినా ఆంధ్ర దేశంలో నున్నన్ని బౌద్ధ శిల్పాలు, పాల రాతి బౌద్ధ స్థూపాలు, సుందరమందిరాలు, ఆరామాలు లెక్కకు మించినని మరెక్కడా లేవు

ఆ రోజుల్లో అమరావతీ, నాగార్జున కొండ పవిత్ర యాత్రా స్థలాలగానే గాక సాంస్కృతిక కేంద్రాలుగా, విజ్ఞాన వేదికలుగా, విశ్వ విద్యాలయాలుగా కూడా విలసిల్లాయి. అందువల్లనే ప్రపంచ నలుమూలల నుండి ఎందరో విజ్ఞాన వేత్తలు, తత్వవేత్తలు వచ్చి. ఈ పవిత్ర 'స్థలాలను సందర్శించేవారు. వసంత కాలంలో చల్లని మలయమారుతం విజృంభించి వీచినట్టుగా మన దేశంలో బౌద్ధ మతం వ్యాపించి, మూఢ నమ్మకాలను తుడిచిపెట్టి, సుఖ శాంతులను నెలకొల్పింది. అయితే హీనయానంతో ప్రారంభమయిన బౌద్ధ మతం మహాయాన విజృంభణతో అంత మొందింది.

వివిధ సుమ పరిమళాలతో వ్యాప్తిచెందిన ఈ మతాన్ని మళ్లా ప్రళయ ఝంఝా మారుతంలా మరొక మత విశ్వాసం మన దేశంలో వ్యాపించి శాంతి, సౌఖ్యాలను మంట గలిపి నీట ముచింది. ఆనాటి మత గ్రంథాలు అగ్ని దేవునికి ఆహుతి అయ్యాయి. ఆనాటి సుందర శిల్పాలు, అందమైన మందిరాలు కొందరి మూర్ఖచేష్టలకు బలి అయ్యాయి. వారి హింసాకాండను భూదేవి చూసి భరించలేక, దుఃఖించి తన వడిలో వాటిని దాచి, ఉంచుకొంది. సుమారు పది శతాబ్దుల అనంతరం ఆ యమర శిల్పాలలో కొన్ని నేటి త్రవ్వకాలలో బయల్పడి చూపరులతు విస్మయం కలిగిస్తున్నాయి. ఆనాటి మన కళాకారుల శిల్ప చాతుర్యాన్ని ఇవి కొంతవరకు చాటిచెప్తున్నాయి. ఆనాటి బౌద్ధ మత గ్రంథాలు ఇక్కడ మనకు లభ్యం కాకపోయినా కొరియా, జపాన్, సయ్యాం మొదలైన దేశాలలో మనకు లభ్యం కాగలవు. ఆనాటి మన సంగీతాది కళలగురించి మనం కొంతవరకైనా తెలుసుకొనడానికి ఇవి ఉపకరించగలవు. ఆ దేశాలకు ఎవరైనా మన పరిశోధ

కులు వెళ్లి వీటిని పరిశీలించి దీక్షతో పరిశోధించగలిగితే బౌద్ధ యుగంనాటి ఆంధ్రుల సంస్కృతీ, చరిత్రా మనకు ఎంతో లభించగలవు.

జపాన్‌లో షింటోమత ఆలయాలు ఉన్నాయి వీటిలో పాటించే మత సంప్రదాయాలకు బౌద్ధమత సంప్రదాయాలకు చాలా సన్నిహిత సంబంధాలున్నాయి. వీరి ఆరాధనలో నృత్య సంగీతా లున్నాయి మన ఆరాధనా నృత్య సంగీతాలకు వారి ఆరాధనా నృత్యసంగీతాలకు దగ్గర పోలికలున్నట్లు ఒక తత్వవేత్త చెప్పగా విన్నాను. అందువల్ల వీటిలోని రాగాలను, తాళగతులను, నృత్యవిన్యాసాలను మనం పరిశోధించగలిగితే బౌద్ధయుగంనాటి మన ఆరాధనా విధానాలు మనకు తెలియగలవు.

కంబోడియాలోని అంగోర్‌వాట్‌లో గల ఒక ఆలయంలోని గోడలపై ఒక చిత్రమైన శిల్పముంది. ఆ శిల్పంలో పాలసముద్రం, శేషతల్పం, శివకేశవుల రూపంగల ఒక శిల్పం ఉంది.

అర్ధనారీశ్వరుడు మనకు సుపరిచితుడే ర్యాలి క్షేత్రంలో ఒక విగ్రహంగా మోహినీ కేశవమూర్తులు ఉన్నారని మనకు తెలుసు. కాని కంబోడియాలో ఉన్నట్లు అర్ధభాగం కేశవునిగాను, అర్ధభాగం శివుడుగాను ఉన్న విగ్రహం ప్రపంచంలో మరెక్కడా లేదు. ఈ ఆలయం గోడలపైని గల శిల్పాలలో ఈ విగ్రహం ఉంది. దీని రేఖాచిత్రం ఈ గ్రంథంలో ముద్రించాము.

ఈ శిల్పం హరిహర సంప్రదాయానికి చెందినదని మనం సులువుగా గ్రహించవచ్చును. అయితే ఈ సంప్రదాయం ఎక్కడనుండి ఇక్కడకు వచ్చింది? హరిహరనాథ మత సంప్రదాయం మన ఆంధ్రదేశంలో తప్ప వేరొకచోట ఉన్నట్టు కనబడదు. పల్నాడు బ్రహ్మన్న, నెల్లూరు తిక్కన ఈ సంప్రదాయాన్ని ప్రచారం చేశారు. కనుక ఈ మతం ఆంధ్రదేశం నుండే కంబోడియాకు వ్యాపించియుండాలి. అయితే ఎవరు ఎప్పుడు ఈ మతాన్ని కంబోడియాలో వ్యాపింపచేశారు? ఈ యంగోర్‌వాట్ ఆలయంలో నుండిన ఆరాధనా విధానాలు

ఎటువంటివి ? ఆ యారాధనలో నృత్య సంగీతాలు ఉండేవా ? ఉండియుంటే అవి ఏవిధమైనవి ? పరిశోధించాలి.

సయ్యాం (థాయ్‌లాండ్)లో బౌద్ధ, శైవమతాలు రెండూ ప్రచారంలో ఉన్నాయి. రామాయణ, భాగవతాది కథలుగూడా అక్కడ వ్యాప్తిలో ఉన్నాయి.

చాకలి ఒకడు ఏదో ఒక మాట అన్నందుకు శ్రీరాముడు సీతను అరణ్యానికి పంపించినట్టు, ఆ తర్వాత ఆమె వాల్మీకి ఆశ్రమంలో తన జీవితాన్ని గడిపినట్టు మనం చెప్పుకొంటాం. కాని సయాం వారి రామాయణంలో ఈ కథ కొద్దిగా భిన్నంగా ఉంది. రావణ సంహారానంతరం సీతా సమేతంగా శ్రీరాముడు అయోధ్యకు తిరిగివచ్చి, పట్టాభిషిక్తుడై సుఖసంతోషాలతో రాజ్యపాలన చేస్తూం డగా ఒకనాడు శూర్పణఖ చిత్రకారిణిలా మారువేషంలో సీతమ్మ దగ్గరికి వచ్చింది. ఆ యంతః పురాంగనల చిత్రపటాలను ఆమె చిత్రించి ఇచ్చింది. ఆ యంతఃపుర స్త్రీలు అంతటితో ఊరుకోక రావణుని చిత్రాన్ని వేసి చూపించ మని ఆమెను కోరారు. అతనిని వర్ణించి చెబితే చిత్రించి ఇస్తానని ఆమె అంది. అప్పుడు ఆ స్త్రీలు రావణుని వర్ణించమని సీతా దేవిని కోరేరు. రావణుని తానెన్నడూ కన్నెత్తి చూడలేదని సీతాదేవి వారికి చెప్పింది. రావణుని శరీరంలోని ఏ యొక్క భాగాన్నైనా వర్ణించి చెబితే తాను పూర్తి రూపాన్ని చిత్రించగలనని ఆ మాయా చిత్ర కారిణి అంది. అప్పుడు సీతాదేవి తాను పొరపాటున చూసిన రావణుని కాలి బొటన వేలు గోరును వర్ణించి చెప్పింది. వెంటనే ఆ మాయా చిత్రకారిణి, శూర్ప ణఖ రావణుని పూర్తి చిత్రాన్ని చిత్రించి ఇచ్చింది. ఆ చిత్రాన్ని ఆ యంతఃపుర స్త్రీలందరూ చూసిన తర్వాత ఆ చిత్రకారిణి కౌశల్యాన్ని తన భర్తకు చెప్పాలన్న తలంపుతో ఆ చిత్రాన్ని తన తలగడ క్రింద సీతమ్మ దాచి యుంచింది. రాముడు ఆ చిత్రాన్ని చూసి, రావణునిపై సీతకు ప్రేమ యున్నందువల్లనే ఆ చిత్రాన్ని దాచుకొన్నదని శంకించి ఆమెను అడవిపాలు చేశాడు.

ఈ తాయిలాండు రామాయణ కథ మన జానపదుల యక్షగానాలలోను కుచ్చల కుశలాయకంతోను ఉంది. అయితే ఈ కథ సయ్యాంలో ఎలా ప్రచారం

లోకి వచ్చింది? ఇది మన ఆంధ్రదేశం నుండి సయ్యాం వెళ్ళిందా? లేక అక్కడనుండి మన దేశానికి వచ్చిందా? ఇది పరిశోధించగగిన విషయం.

అక్కడ ప్రచారంలో నున్న శైవ బౌద్ధ మతాలు ఏవిధంగా ఉన్నాయి? ఆంధ్రదేశంలోని ఆరాధనా విధానాలకూ సయ్యాంలోని ఆరాధనా విధానాలకూ సారూప్యం ఉందా? ఇలాంటివన్నీ పరిశోధింపదగిన అంశాలే.

ఒక వంద సంవత్సరాల క్రితం విశాఖ, విజయనగర, శ్రీకాకుళం జిల్లాలనుండి అనేక మంది ఆంధ్రులు తూర్పుదేశాలకు వలసవెళ్లి స్థిరపడ్డారు. అయితే వీరిని గురించి కాక, సుమారు తొమ్మిది, పది శతాబ్దుల క్రిందట ఆ దేశాలకు వలస వెళ్లిన ఆంధ్రుల గురించి మనం తెలుసుకోవాలి. అప్పుడు మన ప్రాచీన సంస్కృతి గురించి మనకు కొంతవరకు తెలియవచ్చు.

కళాకారుల స్వప్నభూమి సుందర బలిద్వీపం. ప్రాచీన హైందవ మత సంప్రదాయాలు కొన్ని ఇంకా అక్కడ నిలిచి యున్నాయి. అక్కడ మాధవుని ఆలయం ఒకటి ఉంది. ఆ యాలయంలో నృత్యపూజ జరుగుతుంది. వాయిద్య సమ్మేళనం, నృత్యకథలు, ఆటపాటలు మొదలైన వన్నీ మన హైందవ మతాను సారమే ఇక్కడ జరుగుతూ ఉంటాయి. ఇక్కడున్న ఆలయా లన్నింటిలోను షోడశోపచారాలు జరుగుతాయి. ఇవన్నీ మన ప్రాచీన కళా స్వరూపాలను పోలియున్నాయి. అక్కడి స్త్రీల ఆహార్యం మన అజంతా శిల్ప సుందరుల ఆహార్యాన్ని పోలియుంటుంది.

బలిద్వీపం భూతలస్వర్గం, కవుల విహారలోకం, కళాకారుల ఊహాలోకం. ఇక్కడ మనం పరిశోధించదగిన విషయాలు అనేక మున్నాయి.

ఇలాగే జావా, సుమిత్ర మొదలైన దేశాలలో మన సాంస్కృతిక చిహ్నాలు ఎన్నో మిగిలి ఉన్నాయి.

పలువురు ఆంధ్ర పరిశోధకులు ఈ దేశంలో పర్యటించి, పరిశోధిస్తే మన ప్రాచీన కళా వైభవం, సాంస్కృతిక వికాసం వెలుగులోకి రాగలవు, మన గురించి మనకు తెలియని విషయాలెన్నో మనకు తెలియగలవు.

ఈ గ్రంథం చిన్నదే, కాని గత రెండువేల సంవత్సరాలనుండి వస్తున్న మన సాంస్కృతిక చరిత్రను ఇందులో క్లుప్తంగా పొందుపరచాను.

మన నృత్య సంగీతాల, కవితాసాహిత్యాల, భాషాభావాల అభివృద్ధికి నాటినుండి నేటివరకు పాటుపడిన, మన సాంస్కృతిక వికాసానికి దోహద కారులైన స్త్రీనర్తకుల గురించి, వారి నర్తన సంప్రదాయాల గురించి బహు సూక్ష్మంగా, అతి క్లుప్తంగా ఇందులో తెలియజేశాను.

ఈ చిన్న గ్రంథాన్ని హృదయపూర్వకంగా ఆంధ్రజాతికి అర్పించు కొంటున్నాను.

భారతమాతకు ఆంధ్రమాత బిడ్డలు, చేసిన సేవ ఇంతవరకూ ఎవ్వరికీ సంపూరంగా తెలియదు. దానిని తెలియజేయవలసిన బాధ్యత మనది. ఆ తరుణం నేడు ఆసన్నమైంది. అందుకే దీనిని మీకు అందజేస్తున్నాను

హైదరాబాదు
21-8-1987.

-నటరాజ రామకృష్ణ

# సాగరసీమ నృత్యకళా విశిష్టత

శ్రీముఖలింగేశ్వరునిపై ఆన, ఆనాడు బహుకొద్దిమందే అయినా ఆ కాళింగులు ప్రాణాలకు తెగించి, అతి ధైర్య సాహసాలతో అశోకుని సైన్యాలను ఎదిరించి బానిస బ్రతుకుకంటే యుద్ధభూమిలో మరణించి వీర స్వర్గ మలంక రించడమే మేలని తలిచి, పోరాడక పోయుంటే, మహా సామ్రాజ్య విస్తరణ కాంక్షతో తప్పించిపోయిన ఆ యశోక చక్రవర్తి తన సర్వస్వాన్ని త్యజించి, బౌద్ధ మతాన్ని స్వీకరించి ప్రపంచమంతటా శాంతి సందేశాన్నే కాక ప్రేమ వాహినులను కూడ ప్రవహింప జేసేవాడు కాదు.

ఆనాటి ఆ కళింగ రాజ్య సైనిక స్థావరమైన నగరికటకం ఎంత ధన్య మైంది ! ఎంత పవిత్రమైన స్థలం ముఖలింగ క్షేత్రం ! ఈ ముఖలింగ పుణ్య క్షేత్రంనుండే ఒక కొత్త వెలుగు ప్రపంచమంతటా ప్రసరించింది. ఆ తర్వాత ఎన్నో బౌద్ధ స్థూపాలు ప్రపంచమంతటా వెలిశాయి. ఇవన్నీ సుందర కళా నిల యాలు. ఈ కళింగ యుద్ధానంతరమే ఆంధ్ర దేశంలో లలిత కళలకు ఒక స్వర్ణ యుగం ప్రారంభమయింది.

మన హిందువులలో చాలామంది బౌద్ధ మతాన్ని స్వీకరించారు. వీరంతా బౌద్ధమత ధర్మాలకు కట్టుబడ్డారు. వీరు తమ అందమైన ఆడ బిడ్డలకు నృత్య కళను నేర్పించి, పర్వదినాలలో బుద్ధ దేవుని ప్రీతికొరకు నృత్య పూజలు చేయించేవారు. అయితే ఆనాటి నృత్యకళా స్వరూపం ఎలా ఉండేది ? ఆ నృత్య ఆరాధన ఎలా జరిగేది ? వీటిని గురించి సంపూర్ణంగా తెలిసికొనడానికి వీలు

లేకుండా ఆనాటు వైభవోపేతంగా స్థూపాలపైని చిత్రింపబడిన శిలా మూర్తులు నేడు శిథిలమై, మూగవోయి తమ కన్నీటి గాథలను అక్కడక్కడ తెలియజేస్తు న్నాయి. అందువల్ల ఆనాటి నృత్యకళనుగురించి పూర్తిగా తెలుసుకొనడానికి సాధ్యం కాకుండా ఉంది, కాని మనం కొరియా, జపాన్ మొదలుకొని వియత్నాం, కంపూచీ, సయాం, ఇండోనేసియా, బర్మా దేశాలను పర్యటించి, ఇప్పటికీ అక్కడ జరుగుతున్న నృత్యపూజలను, ఆరాధనా విధానాలను పరిశీలించి, పరిశో ధిస్తే కొంత తెలుసుకొనడానికి అవకాశముంది.

ముఖలింగం శ్రీకూర్మం అరసవిల్లి, రామతీర్థాలు మొదలైన పుణ్య క్షేత్రాలలో నృత్యపూజ ఉండినట్లు మనకు కొన్ని సాక్ష్యాధారాలు ఉన్నాయి. ముఖలింగం అతిప్రాచీనమైన శైవక్షేత్రం. విష్ణుమూర్తి అవతారాల్లో రెండవది కూర్మావతారం నేనెరింగినంతవరకు ఈ యవతారమూర్తికి ఒక్క శ్రీకూర్మం లోనే ఆలయముంది ఈ యాలయంగూడా చాలా ప్రాచీనమైంది. ఈ శ్రీకూర్మం వద్దనే చైతన్యమహాప్రభువు పాదముద్రలున్నాయి. చైతన్యసాంప్రదాయ సంకీర్తనలు, నృత్యకేళికలు ఇక్కడ జరుగుతూ ఉండేవి. అందువల ఇక్కడి కొన్ని నృత్యగాన కళారీతులు చైతన్య మత సంప్రదాయానికి బద్ధమై దాని ప్రభావానికి లోనై యున్నాయి.

ఈ ప్రాంతంలో మద్దెలవాయిద్యానికి ఓఢ్రదేశ నర్తన మద్దెలవాయిద్యానికి చాలా చాలా దగ్గరపోలిక లున్నాయి. ఓఢ్రుల నర్తన సంగీతం ఉత్తరాది బాణీకి దగ్గరగా ఉన్నా మద్దెలవాయిద్యం మాత్రం దక్షిణాది ప్రాచీన ధ్రుపద బాణీని పోలియుంటుంది. ఈ బాణీ నేటికీ శ్రీకాకుళం జిల్లాలో వినబడుతుంది.

తెలుగునాట ఆడేవారు పాడతారు. దీనివల్ల భావాభినయం పెంపొందింది. ఓఢ్రుల ఒడిస్సీ మూగనర్తనం. పూరీజగన్నాథుని ఆలయంలో తప్పనిసరిగా గీతగోవిందాన్ని పాడుతూ ఉంటారు. పూర్వం ఈ యష్టపదులకు మహారి వనితలు నృత్యాన్ని ప్రదర్శించేవారు. గీతగోవిందాన్ని రచించిన జయదేవుని

భార్య పద్మావతి. ఈమె తెలుగువారి ఆడపడుచని అంటారు. జయదేవుడు అష్టపదులను పాడుతూ ఉంటే పద్మావతి నృత్యాభినయాలను ప్రదర్శించేది. బంగారానికి తావి అబ్బినట్లుండేదిట ఆమె అభినయం.

గంజాం జిల్లాకు చెందిన ప్రతాపరుద్రదేవ మహారాజు అయిదు వందల మంది స్త్రీనర్తకులను పూరీ జగన్నాథుని సేవకు అర్పించాడట. గంజాంజిల్లాలో ఒకప్పుడు తెలుగువారు అధికసంఖ్యాకులుగా ఉండేవారు. కాని ఈ ప్రాంతంలోని ప్రభువులు మాత్రం ఓఢ్రులు. ఈ ప్రతాప రుద్రదేవుడు జగన్నాథుని సేవకు అర్పించిన ఈ నర్తకులు ఎవరు ? ఓఢ్రవనితలా, తెలుగువనితలా ? తెలుగువారే అయితే అనాటి వారి నృత్యసంప్రదాయం ఎటువంటిది ? ఇది పరిశోధించదగ్గ విషయం.

తుచ్ఛ రాజకీయాలవల్ల నేడు భాషాపరమైన రాష్ట్రాలు ఏర్పడ్డాయి, గాని పూర్వకాలంలో ఈ విభజనలు లేవు. భాషా వైషమ్యాలు లేవు. దేశమంతా ఒక్కటే. జగన్నాథుడు అందరికీ దేవుడే. ఆనాడు భారతదేశ సాంస్కృతికభాష సంస్కృతం, దక్షిణదేశ సాంస్కృతిక భాష తెలుగు. రాను రాను సంస్కృత భాష వాడుక తగ్గిపోయింది. అది పండితుల భాష అయింది. ఒకవిధంగా మృత భాష అయింది. అందువల్ల దానిని దేవభాష అన్నారు.

తెలుగు సజీవ భాష గనుక అనేక మార్పులకు లోనైనా సాంస్కృతిక భాషగా తన విశిష్టతను కాపాడుకొంది.

ఒరిస్సాలోని వివిధ సంస్థానాలలో గల లిఖిత ప్రాచ్యగ్రంథాలను మనం పరిశీలించి, పరిశోధించ గలిగితే మన నాట్య చరిత్ర కందని అనేక విషయాలను మనం తెలుసుకొనగలం. ఆంధ్ర సంస్కృతికి, దేశ చరిత్రకు ఈ విషయాలు ఉపకరించగలవు. గంజాంజిల్లాలోని ప్రతాపరుద్రదేవుడు, కాకతి ప్రతాపరుద్రుడు ఒకరు కారు.

సూర్య భగవానునికి మన దేశంలో ఆలయాలు బహు కొద్దిగా ఉన్నాయి. వీటిలో నేడు సజీవంగా ఉన్న ఆలయం ఒక అరసవిల్లిలోనే ఉంది, ఇంకెక్కడా ఉన్నట్టు కనబడదు.

బౌద్ధ, జైన, హిందూ మతాలు వెల్లివిరిసిన పుణ్యక్షేత్రం విజయనగర జిల్లాలోని రామతీర్థం, ఈ ఆలయాలన్నింటినిలోను పూర్వం నృత్యపూజ ఉండేది.

వైష్ణవ భక్తులైన వెలమదొరలు పాలించిన సంస్థానం బొబ్బిలి. వీరి ఇల వేల్పు వేణుగోపాలుడు. ఈ వేణుగోపాలునికి బొబ్బిల్లో చక్కని ఆలయ ముంది. ఈ గుడిలో నృత్యపూజ జరిగేది. ఈ సంస్థానాధీశులు నృత్యకళను పోషించారు. ముప్వురు సహోదరులు గడ్డిభుక్త చిరంజీవి, సంజీవి, సువర్ణ అనే ప్రసిద్ధ నాట్య కళాకారు లుండేవారు. సువర్ణ గుడిలో నృత్యపూజ చేసేది. మిగిలిన ఇద్దరూ ఆస్థాన నర్తకీమణులు, చిరంజీవి కుమార్తె జీవరత్నం. ఈ బొబ్బిలి జమీందారులు పోలో వంటి విదేశీ క్రీడలను ఆదరించడంతో జీవ రత్నమ్మతో విశిష్టమైన బొబ్బిలి నర్తన సంప్రదాయం అంతరించింది.

అనాటి బొబ్బిలి జమీందారులు ఆహ్వానించగా మాదగులనుండి బుగత రామయ్య, గోపన్న లనే తండ్రీ కొడుకు ఇద్దరు బొబ్బిలి సంస్థానానికి వచ్చారు. వీరిద్దరూ ప్రసిద్ధ నాట్యాచార్యులే గాక గొప్ప మార్దాంగికులు, మహావైధావులు. వీరి కాలంలోనే బొబ్బిలి కేశవయ్య అనే ఒక మహా వైణిక విద్వాంసుడు ఉండేవాడు. ఇతడు దేశంలోని సంగీతజ్ఞులపల్ల బెబ్బులిగా పేరుగాంచాడు.

జీవ రత్నమ్మది పాడుతూ ఆడే సంప్రదాయం, ఎంతగొప్పగా ఆడేదో అంతగొప్పగా పాడేది. వీణా, హార్మోనియం వాయిద్యాలను ఈమె వాయించేది. ఆ రోజుల్లో హార్మోనియం వాయించడం అందరికీ అలవాటు. ప్రతి నర్తకి విధిగా పాడ్డం, హార్మోనియం వాయించడం నేర్చుకొనేది.

ఆ యాస్థానంలో నాట్యకళకు ఆదరణ తగ్గిపోవడంవల్ల జీవ రత్నమ్మ కొద్దికాలమే ఆస్థాన నర్తకిగా ఉంది. తర్వాత గృహస్థాశ్రమం స్వీకరించింది.

ఆమె భర్త చనిపోయిన తర్వాత మా నృత్యనికేతన్‌కు వచ్చి అనేక మంది విద్యార్థులకు బొబ్బిలి బాణీ ఆట నేర్పింది

బొబ్బిలి నాట్య బాణీలో చెప్పుకో తగ్గది జారు అడవు సంప్రదాయం. ఈ సంప్రదాయం దేశంలో మరెక్కడా లేదు. ఆమెకు అభిమానమైన "మనవి చేకోరా, నా చక్కని స్వామి" అనే వర్ణాన్ని ఆమె తెల్లచీరెకట్టుకొని తన వృద్ధాప్యంలో గూడా ఆడుతూ ఉంటే హంసలు కాళ్లకు చిరు అందెలు కట్టుకొని సందడిచేస్తూ ఆడుతున్నట్టుండేది. ఈ బాణీ ఆట చాలా కష్టమైంది. ఇంత అందమైన ఆటను పాటమ ప్రదర్శించిన వేరొక కళాకారిణిని నేను చూడలేదు.

పూర్వం బొబ్బిలిలోని వేణుగోపాలస్వామివారి ఉత్సవాలు ఏటేటా గొప్పగా జరిగేవి. ఆ రోజుల్లో విద్యుత్ దీపాలే కాదు గాస్‌లైట్లుగూడా లేవు. రాత్రిపూట దేవుణ్ణి ఊరేగించేటప్పుడు పెద్ద పెద్ద పేడపిడకలకు కర్రలు గుచ్చి కిరసనాయిల్లో ముంచి, వాటిని వెలిగించి పట్టుకొనేవారు. ఆ కాగడాల వెలుగులో బుట్టబొమ్మలు, కీలుగుర్రాలు, తప్పెటగుండ్లు, కారువా నాట్యం మొదలైన వినోదాలు జరిగేవి. వీటిని చూడ్డానికి దూర ప్రదేశాలనుంచి గూడా విపరీతంగా జనం వచ్చేవారు. వెలుగుతున్న కాగడాలనుంచి కాలుతున్న పిడకముక్కలు ఆ జనంమీద పడుతున్నా వారు లక్ష్యపెట్టేవారు కారు. అదొక సరదా, అదొక వేడుక.

ఈ బొబ్బిలి జమీందారులలో ఎవరికైనా పట్టాభిషేకం జరిగినప్పుడు, ఏవైనా ప్రత్యేక వేడుకలు జరిగినప్పుడు పూర్వం మదరాసునుండీ, తంజావూరు నుండీ గూడా ప్రసిద్ధ నర్తకులను ఆహ్వానించేవారు. ఆ యుత్సవాలలో చివరికు ఆస్థాన నర్తకుల కేళికలు జరిగేవి. ఒకసారి మహారాజావారి పట్టాభిషేకం, చూడ్డానికి గవర్నర్ సర్ ఆర్థర్ హోప్ వచ్చారు పట్టాభిషేకం వేడుకల చివరి రోజున జీవరత్నమ్మ తెల్లని వస్త్రాలు ధరించి కేళిక చేసింది.

హంసలా గాలిలో తేలిపోతూ జారడుగుల కేళికను ఈమె చేస్తూంటే సర్ ఆర్థర్ హోప్ చూసి, ఆశ్చర్యపోయారు. మర్నాడు మళ్లా ఈమె కేళికను కోరి

పెట్టించుకొన్నారు. ప్రపంచ ప్రఖ్యాతమైన విదేశీ స్వాన్ డాన్స్‌ను పోలియుందని ఆమె కేళికను ఆయన మెచ్చుకొన్నారు. ఇటువంటి కేళికలు జీవరత్నమ్మ తర్వాత మరి జరగలేదని ఆమె నాతో చెబుతూ, ఆనాటి కేళికలను వివరిస్తూ, ఎన్నో ముచ్చట్లు ఆమె నాకు చెప్పేది. ఆమె చివరకు నా చేతులమీదుగానే వెళ్లిపోయింది.

బొబ్బిలి సంస్థానంలోని సరస్వతీ పుస్తక భాండాగారంలో ఎన్నో నృత్య శాస్త్రగ్రంథాలు ఉండవచ్చును. అవి భావి నృత్యశాస్త్రవేత్తలకు ఉపకరించగలవు.

ఈ జీవరత్నమ గురించి వ్రాయాలంటే అదొక పెద్ద గ్రంథ మవుతుంది. "రుద్ర గణిక" రెండప భాగంలో ఆమెగురించి వ్రాస్తున్నాను. నాట్యానికి జీవం పోసిన "రత్నం" ఈ జీవరత్నం అని ఒక్క ముక్క అంటే సరిపోతుంది.

ఆమె పాట విని, ఆమె ఆటను చూసిన నేను, ఆమె వద్ద నృత్యం నేర్చు కొన్న కొంతమంది నా శిష్యులు ధన్యులు.

జయపురం ఒకప్పుడు ఉమ్మడి మదరాసు రాష్ట్రంలో ఉండేది ఈ జయ పురం మహారాజులు ఓ ఢ్రులే అయినా తెలుగు సాహిత్యాన్ని, కళలను పోషించారు వీటి అభివృద్ధికి వారు దోహదకారులైనారు. జయపురం మహారాజా వారు శ్రీ విక్రమ దేవ వరగారు ఆ ఆంధ్ర యూనివర్సిటీకి చేసిన ఆర్థిక సహాయం అందరికి తెలిసిందే. పూర్వపు గంజాం జిల్లాలోని చీకటికోట, ధారాకోట, చిన్నకిమిడి, పెద్ద పర్లా కిమిడి , టెక్కలి మొదలైన జమీందారులు ఓఢ్రులైనప్పటికీ తెలుగు సాహిత్యాన్ని కళలను పోషించారు.

విజయనగరం పూసపాటి మహారాజులు గజపతులు. వీరు తెలుగు సాహి త్యాది కళలనే గాక ఉత్తరాది కళారీతుల్ని గూడా ప్రోత్సహించారు, పోషించారు.

మత్స్య వంశీయులైన మాడుగుల జమీందారులు గూడా కళా ప్రియులు. నృత్య, సంగీత, సాహిత్యాలను వీరు పోషించారు.

నరాహ నృసింహస్వామి వారి దివ్యక్షేత్రమైన సింహాచలం కళలకు నిలయంగా విరాజిల్లింది.

విశాఖ జిల్లాలోని బొజ్జన కొండమీద చూడతగ్గ బౌద్ధ శిధిలా లున్నాయి. ఆనాటి శిల్పుల శిల్పచాతుర్యం వీటిలో ప్రతిబింబిస్తూ ఉంది. ఈ కొండ నిద్రిస్తున్న ఒక ఏనుగులా ఉంది. దానిపైని ఒక అంబారీలా ఒక స్థూపం పూర్వముండేది. అయితే ఆస్థూపం నేడు మనకు కనబడదు. దాని పునాదులు మాత్రం ఉన్నాయి. బౌద్ధ మతంలో తెల్ల ఏనుగుక్కి ఒక విశిష్ట స్థాన ముంది. ఈ కొండ చుట్టూ గల ఒక్క రాతి ముక్కనుగూడా విడిచిపెట్టకుండా శిల్పంతో నింపివేశారు ఇదంతా పరిశోధించతగ్గ ప్రదేశం.

విశాఖ జిల్లాను వదిలిపెట్టి తూర్పు గోదావారి జిల్లాకు వస్తూంటే పాయకరావు పేట తగులుతుంది. దీనికి దక్షిణాన "తాండవ" నది ఉంది. పూర్వం ఈ నది పరమశివుని తాండవంలోని గంభీరధ్వనులను వినిపిస్తూ ఉరకలు వేస్తూ, పరుగులు తీసేదేమో! ఇప్పుడు మాత్రం బాలకృష్ణుని చిన్ని పాదాల చిరు మువ్వల ధ్వనుల్ని మాత్రమే వినిపిస్తూ ఉంటుంది. ఈ నదిని దాటితేనే "తుని" పట్నం వస్తుంది ఈ తాండవ నది ఎవరిదన్న తగవు ఈ రెండు పట్నాలవారి మధ్యా ఒకప్పుడు వచ్చింది. "మాదంటే మాది" అని తీరిగ్గా దగవులాడుకొనేవారు. ఛందో బద్ధంగా పరుషవాక్యాలను ఉపయోగించుకొనే వారు. సభలు జరిగేవి, సమావేశాలు జరిగేవి. పంచాయితీలు జరిగేవి. తొడలు చరుచుకొనే వారు మీసాలు మెలివేసుకొనేవారు. తలలు తెగినా పర్వాలేదు గాని తలలు వంచేవారు కారు. అసలైన ఆంధ్ర పౌరుషాన్ని ప్రదర్శించే వారు, తనకేమి సంబంధం లేదన్నట్టుగా ఆ నది తాండవమాడుతూ ప్రవహించేది. చివరకు ఒక తెల్ల దొరగారు ఈ తగవు విషయమై తెలుసుకొని "ఈ నదిలో ఉత్తరం వైపున్న సగభాగం పాయకరావుపేట ప్రజలది, దక్షిణం వైపున్న సగభాగం తుని ప్రజలదని తీర్పు చెప్పి రాజీ కుదిర్చారు. తుని తగవు పరిష్కారమయింది. అంతా సంతోషించి, అమ్మవారి పండగలు, జాతర్లు చేసుకొన్నారు.

పూర్వం గోదావరి జిల్లా అంటూ ఒకటే ఉండేది. తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లా లంటూ లేవు. కాటన్ దొరగారి ధర్మమా అంటూ ఇక్కడ కరువు కాటకాలు లేకుండా పోయాయి. భారతదేశమంతటికీ అత్యంత భాగ్యవంతమైన జిల్లాగా మారిపోయింది. లక్ష్మీదేవికి నిలయమైంది. నృత్య, సంగీతాలకు వేదాధ్యయానికి సరస్వతీ పీఠంగా వెలిసింది.

అట్టే కష్టపడకుండా పంటలు పండడంతో ప్రజలకు తీరిక ఎక్కువయింది. తిని కూర్చొని, విజ్ఞాన విందులను విలాస కేళికలను చూసి ఆనందించే ఆసక్తి ఎక్కువయింది. అగ్రహారాల్లోని వేదపండితులకు, విద్వాంసురాండ్రయిన నర్తకీ మణులకు ఆదరణ లభించింది. వరుసగా తొమ్మిది రాత్రిళ్లు నవజనార్దన పారిజాతాన్ని చూసేవారు. ఒక నర్తకి ఒక పదాన్ని అభినయిస్తే ఆ అభినయం తనిగేదికాదు. "ఏదీ ఇంకో భావాన్ని ప్రదర్శించు" అంటూ అడిగి రాత్రంతా అభినయాన్ని తిలకిస్తూ గడిపేవారు. ఒక వేళ నర్తకి ఏదైనా పొరపాటు చేస్తే సభలోని పండితులు లేచి అభినయించి చూపించి, నర్తకిని సరిదిద్దేవారు. అందు వల్ల నర్తకులు చాలా జాగ్రత్తగా అభినయించేవారు.

తునినుండి, ఏలూరువరకు ఇదే తీరున కేళికలు జరిగేవి. పరిపాలనా సౌలభ్యంకోసం గోదావరి జిల్లా తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలుగా విభజింపబడింది.

అన్నవరం దేవాలయంతో తూర్పుగోదావరి జిల్లాలోని నృత్యకళారాధన ప్రారంభమౌతుంది. ప్రాచీన అభినయకళారీతులకు కోనసీమ పుట్టిల్లు. ఇక్కడి ప్రతి చిన్న దేవాలయంగూడా ఒక లలితకళానిలయం.

కుక్కుటేశ్వరుడు, తురంగేశ్వరుడు, కొప్పేశ్వరుడు, చండేశ్వరుడు మొదలైన వింతపేర్లు ఈ ప్రాంతంలోని ఈశ్వరునికి ఉన్నాయి. ఒక్కొక్క క్షేత్రంలోని స్థలపురాణంబట్టి ఒక్కొక్క కథ పీటికి ఉన్నాయి. ఇవి నిజమైన పురాణకథలా పుక్కిటి పురాణకథలా అన్న మీమాంసను వదిలివేస్తే ఈ కథలు

ఎంతో భావ సౌందర్యంతో, కవితా చమత్కారంతో, శిల్పంతో అలరారుతూ ఉంటాయి.

సాధారణంగా అన్ని పుణ్యక్షేత్రాలలోను దేవునికి సంవత్సరానికి ఒక్కసారి కల్యాణోత్సవం చేస్తే మురముళ్లలో వీరేశ్వరునికి ప్రతినిత్యం పెళ్లి జరుగుతూ ఉంటుంది. ఈ దేవుడు ధనవంతుడు, అందువల్ల ఇతనికి నిత్యకళ్యాణం జరుగుతూ ఉంటుంది, పచ్చతోరణాలు కట్టించుకొంటూ ఉంటాడు. ఈ కళ్యాణంలో ఆటపాటలూ, నృత్యకేళికలు, కచ్చేరీలు, విందుభోజనాలు జరుగుతూ ఉంటాయి. ఇంత విలాసవంతుడైన ఈశ్వరుడు భారతదేశంలో మరెక్కడా లేడనే చెప్పవచ్చును. విశాలాక్షీ అన్నపూర్ణమ్మ చెంతనున్న కాశీ విశ్వేశ్వరునికి కూడా ఇంతటి వైభవం లేదు. మధురమీనాక్షి భర్తకూడా ఇలాంటి నిత్యకళ్యాణం జరగడం లేదు. కంచి కామాక్షి విభునిగా వెలసిన పినాకపాణికికూడా ఇంతటి వేడుక లేదు.

కోనసీమంతా ప్రతిధ్వనించే ఇక్కడ నృత్యగానాలు ఈ దేవునికి ఇప్పుడు కరువైపోయాయి. ఆనాటి నృత్య కేళికలగురించి తెలిసిన నర్తక కుటుంబాలవారు కొందరు ఇంకా అక్కడ ఉండి ఉంటారు. వారినడిగి ఆ పూర్వ నృత్య విషయాలను మనం సేకరించవచ్చును.

స్త్రీలు పెట్టుకొనే కొప్పులాంటిది మొలిచిన ఈశ్వరుడు కొప్పేశ్వరుడు అయ్యాడు. పడచుదాని చన్నును పోలినవాడు చంటేశ్వరుడు. కోడిపుంజు ఆకారంలో ఉన్నవాడు కుక్కుటేశ్వరుడు. తురంగంలా ఉన్నవాడు తురంగేశ్వరుడు. కపోతంలా వెలిశాడు కపోతేశ్వరుడు. వీరందరినీ మించినవాడు గుడిమల్లాం అనే ఊళ్లో ఉన్నాడు. అతన్ని మీరు దర్శించుకోవలసిందే గాని నేను వర్ణించకూడదు.

ఊరి మధ్యను ఆలయం, ఆలయంచుట్టూ వీధులు. ఒక్కొక్క వీధిలో ఒక్కొక్క తెగవారి నివాసం. గుడికి చేరువుగా పూజార్లు, నర్తక కుటుంబాల వారు, వీరికి వారికి సాంగత్యం, ప్రణయ పరిచయాలు. వింత వింత అనుభవాలు,

అనుభూతులు. నలుగురికే తెలిసి రచ్చకావడం. ఆలయ పెద్దలు వారికి శిక్ష విధించడం, విధులను నిస్మరించిన ఆ పూజారులను ఆ భగవంతుడే కాపాడడం. శ్రీ రంగనాథుడు విప్రనారాయుణ్ని కాపాడినది మొదలుకొని అనేక ఆలయాల్లో అనేక కథ లున్నాయి. ఇవి ఎంతవరకు నిజమన్న విషయం మనకు అనవసరం' ఆ యా దేవాలయాల్లో పూర్వముండిన నృత్య, సంగీతాది కళలగురించే మనం తెలుసుకొనడానికి ప్రయత్నిద్దాం. ఆనాటి కళాకారుల్లో ఏ కొద్ది మందో వృద్ధులు లై మిగిలియున్నారు. మనం ఇంకా ఆలోచిస్తూ కూర్చుంటే వారూ ఉండరు.

విష్ణుమూర్తి భోజన ప్రియుడు, అందువల్ల వైష్ణవాలయాల్లో మనకు పులిహోర, చక్కెర పొంగలి, ఉప్పు పొంగలి, లడ్డూలు, వడలు, ప్రసాదంగా లభిస్తాయి. పూర్వం శివాలయాల్లో విభూది, బిల్వపత్రం మాత్రమే ప్రసాదంగా లభించేవి. ఇప్పుడు శివాలయాల్లో గూడ లడ్డూల ప్రసాదం దొరుకుతూంది. అయితే స్వచ్ఛమైన నేయితో ఈ లడ్డూలను చేయకపోవడం వల్ల ఆ మర్నాటికే ఇవి చెడిపోతున్నాయి. కనుక వీటిగురించి కాకుండా ఆ దేవాలయాల్లో ఒకప్పుడు వెల్లివిరిసిన లలిత కళలగురించే ఆలోచిద్దాం.

పైని పేర్కొన్న ప్రాంతాలలో శాస్త్రీయ నృత్యకళేగాక సాంప్రదాయక నృత్యరీతులు అంటే భాగవత, యక్షగానరీతులు, ప్రజాకళలైన జానపద నర్తన రీతులు, గిరిజన నృత్యాలు ఎన్నో ఉన్నాయి. వీటిని గురించి సంపూర్ణమైన పరిశోధన జరగవలసియుంది.

తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలు లాస్యనర్తనానికి, అభినయానికి నిలయాలు, అన్నవరం దేవాలయంతో ఈ జిల్లాలోని నృత్య ఆరాధన ప్రారంభమౌతుందనిచెప్పాను. అభినయ కళారీతులకు కోనసీమ పుట్టిల్లు. కోనసీమలోని ప్రతి చిన్న దేవాలయంగూడా ఒక లలితకళా నిలయం. మురమళ్ల వీరేశ్వరుడు పలివెల కొప్పేశ్వరుడు, ర్యాలి జగన్మోహినీకేశవుడు, అంతర్వేది నారసింహుడు మొదలైన దేవుళ్లందరూ నర్తన ప్రియులే. వీరంతా నృత్య ఆరాధనా సేవలను అందుకొన్నవారే.

తుని సంస్థానాన్ని జగపతులు పరిపాలించారు. అలాగే పెద్దాపురం, రామచంద్రపురాన్ని క్షత్రియులు పరిపాలించారు. రావువంశీయులు ఏలిన సంస్థానం పిఠాపురం. కమ్మప్రభువులది కపిలేశ్వరపురం. ఈ సంస్థానాధీశు లందరూ లలితకళలను బాగా పోషించారు. ఈ సంస్థానాలలోని ఆలయాల్లో ఆగమరీతి నృత్యపూజలు ఉండేవి. వీరి ఆస్థానాలలో అనునిత్యం నృత్యకేళికలు జరిగేవి. పారిజాతాది ప్రజాకళలు ఇక్కడ ప్రచారంలోకి వచ్చాయి. తూర్పు గోదావరి జిల్లాలోని ద్రాక్షారామం దక్షవాటిక. పంచారామాల్లో రెండు ఆరామాలు తూర్పుగోదావరి జిల్లాలో ఉన్నాయి. రెండు పశ్చిమగోదావరి జిల్లాలో ఉన్నాయి. ఆచంటలో చంటీశ్వరుడు వెలిశాడు. ఈ పుణ్యక్షేత్రాలలో నృత్యపూజలు జరిగేవి. కోరుకొండ నరసింహుడు, ద్వారకా తిరుమల వేంకటేశ్వరుడు, బల్లిపాడు మదన వేణుగోపాలుడు నృత్యపూజలను నిత్యం అందుకొన్నవారే.

పారిజాత కలాపాలకు, కర్నాటక కచ్చేరీ ఆటకు తూర్పుగోదావరి జిల్లా లోని మండపేట ప్రసిద్ధిగాంచింది. ప్రపంచాన్నే ఉర్రూతలూగించిన విశిష్ట కళారూపం నవజనార్దనం. ఈ జిల్లాలో తొమ్మిది జనార్ధన ఆలయాలు ఉన్నాయి. ఈ యాలయాలలో విధిగా నవజనార్దన పారిజాతం ప్రదర్శింపబడుతూ ఉండేది.

ప్రాచీన వేంగి క్షేత్రం పశ్చిమగోదావరి జిల్లాలోని ఏలూరు ప్రాంతంలో ఉంది. దీనినే పెద వేగి అంటారు. కాని నేడు ఈ వేంగిక్షేత్రం నామరూపాలు లేకుండా పోయింది.

క్రీ. శ. 3, 4 శతాబ్దుల కాలంలో శాలంకాయనులు ఆంధ్రదేశాన్ని పాలించినప్పటి, ఆ తర్వాత విష్ణుకుండినులు, తూర్పు చాళుక్యులు పాలించినప్పటి ఈ రాజధాని, ప్రాచీన మహానగరం మట్టి దిబ్బల క్రింద మరుగుపడియుంది. ఇక్కడి త్రవ్వకాలలో బయల్పడిన శిల్ప సంపద అద్భుతమైంది. ప్రతి రాయీ, ప్రతి గాజుపూసా, ప్రతి కుండపెంకూ ఆంధ్రుల ప్రాచీన సంస్కృతికి ప్రతి రూపమై ఉన్నాయి. ఆ శిల్పాలలోని స్త్రీమూర్తుల భంగిమలను చూస్తే ఆనాటి మన నృత్యకళా వైభవం మనకు తెలుస్తుంది

వీరభద్రుడు దక్షయజ్ఞాన్ని నాశనం చేసినప్పుడు దక్షవాటికైన ద్రాక్షా రామం ధ్వంస మయింది. ఆ విధ్వంస కాండలో వీరభద్రుడు, అతని గణాలు ప్రదర్శించిన వీరాంగణం ఒక కళారూపంగా వెలిసింది. శైవారాధకులు, వీర ముష్టివారు, దేవాంగులు ఈ నర్తనాన్ని ప్రదర్శిస్తారు. ఉభయ గోదావరి జిల్లాల లోను ఇది ప్రజా నాట్యంగా ప్రదర్శింపబడుతూ ఉంది. ఒకప్పుడు విరివిగా ప్రచారంలో నుండిన ఈ వీరగాథను వీరభద్రునికి అంకితంగా వీరముష్టివారు ప్రదర్శిస్తూ ఉంటారు.

పశ్చిమ గోదావరి జిల్లాలోని పెనుగొండను రాజధానిగా చేసికొని జైన రాజులు ఆంధ్రదేశాన్ని పాలించారు. కాని పెనుగొండ పురవాసులు శైవులు. అక్కడ లెక్కకు మించినన్ని శివలింగాలు ఎండకు ఎండుతూ, వానకు తడుస్తూ నేటికీ వీధుల్లో పడియున్నాయి. ఆ రోజులలో కనుమశెట్టి అనే ఒక వర్తక శ్రేష్ఠ డుండేవాడు. అతని కూతురు కన్యక చాలా అందమైంది. ఆమెను ఒక జైన రాజు పెండ్లి చేసికొనాలని కనుమశెట్టిని అడిగాడు. అతడు అంగీకరించినా కన్యక ఇష్టపడక అగ్ని ప్రవేశం చేసింది. ఆమే కన్యకా పరిమేశ్వరిగా వెలిసింది. ఆమె అగ్ని ప్రవేశం చేసినప్పుడు అక్కడి వీరులు తొక్కిన వీరాంగణమే వీర నాట్య మయిందని కొందరి అభిప్రాయం. ఆ కన్యకా పరమేశ్వరి వైశ్యులకు ఇలవేల్పు యింది.

ఈ వీరనాట్యంలోని సంగీతం, లయ విన్యాసాలు, వాయిద్య విశేషాలు, వాటి శబ్దజాలం, ఆ నాట్యప్రయోగాలు చాలా విశిష్టమైనవి. ఈ వీరనాట్య భంగి మలు, కరణ చారీ విన్యాసాల గురించి ఇంకా పరిశోధించవలసి యుంది. దీనిలోని నాసరాలు, ఖడ్గ రచనలు ఈ పరిశోధనకు ఉపకరించగలవు.

చనివారపు పేట, ఏలూరు జమీందారులు భరత విద్యను, అభినయ కళను పోషించారు. ఈ విద్యలలో నిష్ణాతులైన వారెందరో ఈ సంస్థానాలో ఉండేవారు. వల్లూరు జమీందారులు నృత్యకళా పోషకులు. ప్రసిద్ధ పదకర్త, కవి, పండితుడు, అభినయశాస్త్రవేత్తా అయిన దాసు శ్రీరాములుగారు ఏలూరు వాస్తవ్యులే.

కృష్ణా జిల్లాలోని నూజివీడు వెలమదొరల సంస్థానం. వీరు సంగీత, నృత్యకళా ప్రియులు, పోషకులు. ఈ జిల్లాలోని శ్రీకాకుళం ఆంధ్రుల తొలి రాజధాని. ఇది ప్రసిద్ధ వైష్ణవ క్షేత్రం. దీనికి చేరువలో నున్న ఘంటసాల ఒకప్పుడు ప్రసిద్ధ బౌద్ధ క్షేత్రం. ముక్త్యాల, చలపల్లి జమీందారులు సంగీత, నృత్యకళలను పోషించినవారే. చల్లపల్లి జమీందారులే శ్రీకాకుళం వైష్ణవాలయ ధర్మకర్తలు. ఇక్కడ ప్రాచీన శాసనాలు ఎన్నో ఉన్నాయి. వీటిని పరిశీలించి, పరిశోధిస్తే మన ప్రాచీన సంస్కృతిగురించి ఎంతో తెలియగలదు.

తన పదకవితతో క్షేత్రయ్య ఆరాధించిన గోపాలుడు వెలిసిన గ్రామం మొవ్వ. ఇదీ కృష్ణాజిల్లాలోనే ఉంది. దీనికి చేరువలోనే ప్రపంచప్రఖ్యాతులైన భాగవతుల కళానిలయం కూచిపూడి గ్రామ ముంది.

అతిప్రాచీన బౌద్ధ, శైవ క్షేత్రమైన పెద్దకళ్లేపల్లిలో పూర్వం నృత్య ముండేది. భావదేవరపల్లిలోని భావన్నారాయణుడు, హంసలదీవిలోని శ్రీ మహా విష్ణువు నర్తనప్రియులు. వీరి ఆలయాలలోగూడ నృత్యపూజ ఉండేది.

ఆంధ్రుల నృత్యకళకు విశిష్టతను చేకూర్చిన గ్రామం నంగిగడ్డ. ఒక ప్పుడు ఇక్కడి నర్తకులు కర్నాటకం ఆడడంలో ప్రసిద్ధులు. వీరు ఆంధ్ర నాట్యానికి ఒక చరిత్రను సృష్టించారు.

రాజకీయంగా, పౌరాణికంగా, మతపరంగా, కళావిషయకంగా ఒక విశిష్ట చరిత్రగల పట్నం బెజవాడ. అదే నేటి విజయవాడ. సకల విధాలా ఔన్నత్యాన్ని పొందిన ఇంతటి పుణ్యస్థలం ఆంధ్రదేశంలో వేరొకటిలేదేమో ! విజయునికి పాశుపతాస్త్రాన్ని ఇక్కడున్న దుర్గకొండపైనే శివుడు ఇచ్చాడు. నేడు శిథిలా వస్థలోనున్న మొగల్ రాజపుర గుహాలయాల్లోనే ఒకప్పుడు సిద్ధులు నివసించారు. ఇక్కడ వెలిసిన శివుని ఆరాధన నిమిత్తం ప్రసిద్ధ నర్తకి మాచల్‌దేవి కొన్ని భూములనిచ్చింది, అనేక దాన ధర్మాలు చేసింది. బెజవాడ యుద్ధమల్లుని శాసనాలను పరిశీలిస్తే ఆనాటి సాంఘిక, రాజకీయ వ్యవస్థలగురించి తెలియగలదు.

ముక్త్యాల, జగ్గయ్యపేట, జయంతిపురం మొదలైన ప్రాంతాలలో బౌద్ధ మతం ఒకప్పుడు బహుళ ప్రచారంలో ఉండేది. ఈ ప్రాంతాలలో నేటికీ కొన్ని ప్రాచీన బౌద్ధ స్థూపాలు మనకు కనబడతాయి. అష్టపదులను అభినయించడంలో ఇక్కడి నర్తకులు ప్రసిద్ధిగాంచారు. సభారంజని అనే ఒక ప్రసిద్ధ నర్తకి ఇక్కడ ఒక ఆలయంలో నృత్యపూజ చేసేది.

బందరు, మేడూరు, గుడివాడ మొదలైన కొన్నిపట్నాలు సంగీత, నృత్య కళలకు కేంద్రాలుగా ఉండేవి.

ప్రతిష్ఠానపురం, విజయపురి, ధాన్యకటకం, కొండాపురం మొదలైన నగరాలు శాతవాహనుల రాజ్యకాలంలో ఆంధ్రుల చరిత్రలో ఒక విశిష్ట స్థానాన్ని పొందాయి. అందుకే శాతవాహన శక మంటూ ఒక కాలమానం ఏర్పడింది. శాతవాహనరాజులు పోషించిన మతాలు, ఆ దేవుళ్లకొరకు కట్టించిన మందిరాలు ఆ దేవాలయాల్లో వెలిసిన శిల్పకళ, నృత్య, సంగీతాది కళలు, కవిత్వం, సాహిత్యం, అలంకరణ తీరులు, పరిపాలనా పద్ధతులు, మతసామరస్యం మొదలైన వాటినన్నింటినీ మనం లోకానికి చాటిచెప్పాలి.

నాగార్జునికొండవద్ద వెలిసిన విజయపురిని కొంతవరకు కృష్ణవేణి తన గర్భంలో శాశ్వతంగా దాచుకొంది. అంతకుముందే హృదయవిహీనులు కొందరు అక్కడి శిల్పాలను, దేవతామూర్తులను మతమౌఢ్యంతో నాశనంచేశారు. ఆ శిల్పాలూ, ఆ అమరమూర్తులూ వారినేమి చేశాయో ? వారి మతోద్ధరణకు ఈ విధ్వంసకాండ ఏవిధంగా తోడ్పడిందో ? మానవహృదయ సౌందర్యాన్ని ప్రతి బింబించే ఆ సుందరమందిరాలను, ఆ పాలరాతి శిల్పాలను నాశనం చేయడానికి వారి హృదయం ఎంత కఠినమై కరడుగట్టిందో ? మనం ఊహించనైనా ఊహించలేము. ఈ విధ్వంసకాండే మతోద్ధారణైతే అంతకన్న అనాగరికం ఇంకోటి ఉండదు.

కొండాపురానికి, ప్రతిష్ఠానపురానికి దగ్గిర సంబంధ ముంది. ప్రాకృతం, ప్రాచీన తెలుగు, మరాఠి ఒక విధంగా ఒకప్పుడు కలిసి వృద్ధిపొందిన భాషలు.

అటు తర్వాత అవి వేర్వేరుగా అభివృద్ధి చెందాయి. కొండాపురం పూర్తిగా నామ రూపాలు లేకుండా నశించిపోయినా హాలుని గాథాసప్తశతీ, గుణాఢ్యుని బృహత్కథా మనకు అదృష్టవశాత్తూ మిగిలియున్నాయి. వీటివల్ల మన ప్రాచీన సంస్కృతి కొంతవరకు తెలుస్తూఉంది

ఆనాటి మహాపట్నమైన ప్రతిష్ఠానపురం (పైఠాన్) నేడొక కుగ్రామంగా మహారాష్ట్రలో ఉంది. అక్కడి ప్రజలకు డబ్బు కావలసినప్పుడల్లా ఆ ప్రాచీన కళా సంపదను భూమిలోనుండి వెలికి తీసి అమ్ముకొంటున్నారు. ఆ పురావస్తువుల చారిత్రక విలువ తెలియని మూర్ఖులు వాటిని అమ్ముతూ ఉంటే వాటి విలువ తెలిసిన విదేశీయులు ఆ వస్తువులను కొని వారి ఇండ్లలో విలాసంగా అమర్చుకొంటున్నారు, మ్యూజియాలలో పెట్టి మన చరిత్రగురించి మనకే చెబుతున్నారు.

ఈ విధంగా తన ప్రతిష్ఠను గోల్పోయిన ప్రతిష్ఠానపురం పైఠాన్‌గా మారింది, ఇంకొన్నాళ్ళకు సైతాన్‌గా మారిపోతుందేమో ?

విజయవాడ కనకదుర్గ గుడివద్ద కృష్ణానదిని దాటి దక్షిణంగా వెళ్తే గుంటూరు జిల్లాలోని ఉండవల్లివద్ద విష్ణుకుండినుల గుహాలయాలు మనకు గోచరిస్తాయి. ఉండవల్లి ఒకప్పుడు గొప్ప వైష్ణవ క్షేత్రం. గొప్ప కళావేత్తలతో ఒకప్పుడు వెల్లివిరిసిన కళాక్షేత్రం ఈ ఉండవల్లి, ఇక్కడి సాంస్కృతిక వికాసంగురించి ఇంకా పరిశోధన అవసరం.

నరసింహస్వామి తెలుగువారి అల్లుడు. అందుకే ఈయనకు ఆంధ్ర దేశమంతటా ఆలయా లున్నాయి. ఇన్ని ఆలయాలు భారతదేశంలో మరెక్కడా ఈయనకు లేవు. ఈయనకు ఆంధ్ర దేశంలో కట్టించిన ఆలయాల్లో ఒకటి మంగళగిరిలో ఉంది. ఉగ్రుడైన ఈ నరసింహ మూర్తిని శాంతింపజేయడానికి బెల్లం పానకం పోస్తూ ఉంటారు. అందుకే ఈయన్ను పానకాలరాయుడన్నారు.

ఒకప్పుడు ఈ ప్రాంతం అగ్ని పర్వత ప్రాంతంగా ఉండేదట. ఒక తెలివైన శాస్త్రవేత్త ఈ నరసింహస్వామి గుహని కటించి, ఈయనకు బెల్లం పానకాన్ని

సమర్పించాలని నిర్దేశించాడట, గత కొన్ని శతాబ్దులుగా కోటాను కోట్ల మంది భక్తులు ఈ దేవునికి పానకాన్ని సమర్పించడంవల్ల అగ్ని పర్వతం చల్లారిపోయిందట! ఏమైతేనేం, స్వామి కార్యం, స్వకార్యం రెండూ నెరవేరాయని మనం సంతోషించవచ్చును

ఈ జిల్లాలోనే "కాజ" అనే ఊరు ఒక టుంది. యతినారాయణ తీర్థులవారి జన్మస్థలం ఇది. శ్రీ కృష్ణలీలా తరంగిణి అనే గ్రంథాన్ని ఈయన సంస్కృతంలో రచించారు. ఇందులోని పాటలు తాళలయలకు నిలయాలు సముద్ర తరంగాలవంటి లయవిన్యాసాలు గల పాట లివి. ఇటువంటి రచనలు భారత దేశంలో మరెక్కడా లేవు.

అన్నమయ్యకు తాళ్ళపాకలోను, త్యాగయ్యకు తిరువయ్యారులోను, క్షేత్రయ్యకు మొవ్వలోను, సిద్ధయ్యకు కూచిపూడిలోను స్మారకచిహ్నాలు వెలిశాయి గాని ఈ నారయ్యకు కాజాలో స్మృతి చిహ్నం లేదు. కాజ ప్రజలు ఈ విషయంలో శ్రద్ధ తీసికోవలసి యుంటుంది.

అమరావతి. ధరణికోట, ధాన్యకటకం బౌద్ధుల చరిత్రకు. హైందవ సాంస్కృతిక చరిత్రకు నిలయాలు. అమరావతిలో అందమైన పాలరాతి స్థూప ముండేది. దీనిమీద నాట్య భంగిమలు గల సుందర శిల్పాలుండేవి. అంటే ఆంధ్రుల నాట్యకళ ఆనాటికే వెల్లివిరిసిందని చెప్పవచ్చును.

అమరావతి, నాగార్జున శిల్పాలను చూస్తే ఆ శిల్పాలలోని స్త్రీమూర్తులు వస్త్రాలు ధరించినట్లే కన్పడదు. అయినా వాయుదేవుడు వాటి వస్త్రాలతో సయ్యాటలాడుతున్నట్లు వాటి అంచులు కన్పడతాయి. పాము కుబుసంవంటి వస్త్రాలలో నుండి ఆ శిల్పాల అవయవసౌష్ఠవం మనకు గోచరిస్తుంది. అంటే ఆనాటిస్త్రీలు అంత సన్నని వస్త్రాలు ధరించేవారని మనం ఊహించవచ్చు అలాంటి సన్నని బట్టలను సాలివారు ఎలా నేసేవారు? చాకలివారు ఏలా ఉతికేవారు? ఎలా చలువ చేసేవారు? అన్న సందేహాలు మనకు తప్పక కలుగుతాయి.

మంచి జరీచీరకట్టి. పమిటతీసి నడుంలో దోపింది. దానిపైని బంగారురేకు వడ్డాణం. కాళ్లకు కడియాలు, వేళ్లకు మట్టెలు. ఆమె రతవనితలా లేదు వజ్రవనితలా ఉంది "చిలుగు బంధ్యారాగ చీనాంబరము గట్టి కటిమీద వజ్రాల కమరునిల్చి" అని శ్రీనాథుడు తన కాశీఖండంలో వర్ణించిన అమ్మ అంబలా ఉంది.

మా పిన్నమ్మగారి కళ్లు గాలా పెద్దవి. ఆనాడు ఆ చాకల్ని చూడగానే ఆమె కళ్లు ఎర్రగా ముఖమంత అయినాయి. "పైడితల్లీ! నా చీరలు కట్టవద్దని ఎన్నిసార్లు చెప్పాలి? కట్టేనే అనుకో, దాన్ని కట్టుకొని మా యింటికే వస్తావా?" అని ఆమె చాకల్ని మందలించింది.

"దొంగతనమెందుకండి అమ్మయ్యగారూ ?"
"మా చీరల పరువు తీస్తున్నావు గదవే !"
"నా చలువే గదమ్మగారూ !"

దీంతో మా పిన్ని కోపమంతా ఎగిరిపోయింది. నిప్పుల్లాంటి నేత్రాలు దానిమ్మగింజల రంగులోకి మారాయి. "నీ ముఖంలే" అంటూ నవ్వేసింది. "దీని భావ మేమి తిరుమలేశా?" అని ఆలోచించా గాని అంతుబట్టలేదు. ఇంతలో మా పిన్ని పద్దుచూసుకొంది, మళ్లాబట్టలు వేసింది. చాకలి నోరు చవి చచ్చిందట ఆమె మా పిన్నిని అడిగి చిన్న జాడీడు అవకాయ తీసుకొంది. అంతా మామూలు వాతావరణమే.

ఆ "చలువ" అన్నమాటలో ఏదో మహత్తు ఉంది ఉండాలి. లేకపోతే మా పిన్ని అంత తొందరగా శాంతించదు ఏమిటా మహత్తు? ఏమిటా కథ?

తర్వాత తాపీగా మా పిన్నిని అడిగాను ఆ "చలువ" లోని రహస్య మేమిటని.

"ఈ పైడితల్లిలా బట్టల్ని చలువ చేసేవారు ఈ తాలూకా మొత్తం మీద లేరు. అందుకే దానికంత అహం. ఏం చేస్తాం? దాని నైపుణ్యాన్ని మెచ్చుకొని రాజీపడక తప్పదు", అంది మా పిన్ని.

"చలువ చెయ్యడమంటే ఏమిటి ? ఎలా చేస్తారు ?" అని అడిగాను.

"ఒకొక్క చీరను చలువ చేయడానికి ఎంత కష్టపడతారను కొన్నావు! ఆ కష్టం చూస్తే నీ మనసు కరిగిపోతుంది. అయిదు తరాలబట్టి వీళ్ళే మనింటి చాకళ్ళు. అందువల్ల దీన్ని ఏమీ అనలేక ఊరుకోవలసి వస్తుంది. తోటలోకి వెళ్లి చూడు, ఎలా చలవ చేస్తారో !" అని చెప్పింది పిన్ని.

మా పిన్ని పొద్దున్న కట్టిన సన్నవి జల్తారు చీరను, ఆ చాకలి, ఆమె భర్త నీళ్ళలో వేసి పిండారు. రెండు కొంగులను ఇరువైపులా నలుగురు సాగదీసి పట్టు కొన్నారు. మరిద్దరు వచ్చి ఆ చీరమీద నీళ్ళు చిలకరిస్తున్నారు. ఆ కొంగులను పట్టుకొన్న నలుగురూ అలలు వచ్చేటట్టు ఆ చీరను గాలిలోకి ఎగరవేస్తున్నారు. చీర ఆరగానే మళ్లా నీళ్ళు జల్లి ఎగరవేస్తున్నారు. ఎలా ఒక గంటసేపు ఆ ఒక్క చీరను చెట్లనీడను ఎగరవేసి, చలువ చేసి ఆరవేశారు. ఎప్పుడు చూడాలి ఆ చీర శోభను. తెల్లని పాము కుబుసంలా అలలు అలలుగా ఆ చీర మెరిసిపోయింది. ఆ నీళ్ళలో ఏం వేశారో నేను గమనించలేక పోయాను. అదే వారి చలువ రహస్యం. ఆ రహస్యం వల్లనే ఆ చాకలి వంటినిండా బంగారు నగలు ఉండడానికి, మా పిన్నికి ఆమెమీద అంత అభిమానం ఉండడానికి కారణం.

మన సంస్కృతిని తెలియజేసే ఆలయాల్లోని శిల్ప సౌందర్యాన్ని విగ్రహాలను విదేశీయులైన తురుష్కులు, ఆంగ్లేయులు నాశనం చేశారని మనం సాధారణంగా అంటూ ఉంటాం. నిజమేనా ? మనం అమరావతి, భట్టిప్రోలు, జగ్గయ్యపేట, ఘంటసాల, గుడివాడ మొదలైన ప్రాంతాలకు వెళ్లి అక్కడి మొండి శిల్పాలను అడిగితే వాటి దీన గాథలను మనకు తెలియచేస్తాయి. వాటి కన్నీటి గాథలు వింటే మన హృదయాలు ద్రవించిపోతాయి, మన మనస్సులు వికలమౌతాయి. మతం పేరిట జరిగిన ఈ మారణహోమానికి మతంమీద, మానవ జాతిమీద, మన జీవితంమీదే మనకు విరక్తి కలుగుతుంది. ఈ ప్రాంతాలలోని ఆ శిల్పాలు వికృత రూపం పొందినవాటికి ఆంగ్లేయులు గాని, తురుష్కులు గాని లేరు. మన వారే మతం పేరిట ఈ విధ్వంసం చేశారు.

మన్మధుణ్ణి దగ్ధంచేసినా శివునికి కోపం తీరక ఆ బూడిదను వంటికి ్రలుము కొన్నాడట. "కసిదీరక మసి పూసుకొన్నాడు" అన్న సామెత అందుకే ుచ్చింది.

అలాగే మనవారు అమరావతి శిల్పాలను నాశనం చేసినా కసి తీరక ఆ ాలరాతి శిల్పాలను కాల్చి ఇళ్ళకు సున్నాలు వేసుకొన్నారు.

హీనయాన బౌద్ధమత చరిత్రకు సంబంధించిన ఒక స్థూపం ధాన్య ుటకంలో ఉంది. ఇక్కడ అమరలింగేశ్వరాలయంగూడా ఉంది. బౌద్ధమతం ్షీణించడంతో శైవమతం ప్రచారంలోకి వచ్చింది. శివుడు నర్తన ప్రియుడు ునుక ఈ యమరలింగేశ్వరాలయంలో నృత్యపూజ జరిగేది. ఇక్కడ నృత్యకళ వివిధ రీతుల్లో వెల్లివిరిసింది. అమరావతి జమీందారులు శైవమతావలంబికులు. ారు నృత్యకళను పోషించారు.

అమరావతికి చేరువలోనే కృష్ణానదీ తీరాన వైకుంఠపుర క్షేత్రముంది. పేరే వైకుంఠపురం, విష్ణుదేవుని నిలయం. ఇంక నృత్య సంగీతాలకు లోటేమిటి ?

గుంటూరు జిల్లాలో పెద్దపుల్లిపర్రు అనే ఊరుంది. ఇక్కడి సిద్ధా ంత్తులవారు భరత విద్యను ప్రచారం చేశారు. ఈ జిల్లాలోనే రేపల్లె ఉంది. ఇది శ్రీకృష్ణుడు తన బాల్యాన్ని గడిపిన రేపల్లె కాకపోయినా ఆ పేరిట వెలిసిన ఊరు. అందువల్ల ఇక్కడకూడా నృత్యకళ వర్ధిల్లింది.

ఆంధ్రా ప్యారిస్‌గా పేరుగాంచిన తెనాలి పట్నంకూడా ఈ జిల్లాలోనే ంది. ఒకానొకప్పుడు ఈ పట్నం నృత్యకళకు నిలయంగా ఉండేది. నృత్య ళను ఆరాధించిన కుటుంబాలవారి వంశస్థులు నేటికీ ఇక్కడ ఎందరో ఉన్నారు. ఎరివద్ద నృత్యకళకు సంబంధించిన ప్రాచీన తాళపత్రగ్రంథాలు, వ్రాతప్రతులు ంభించవచ్చును. అవి లభిస్తే ఈ ప్రాంతంలో అభివృద్ధిపొందిన నాట్యకళా రీతులను గురించి మనం తెలుసుకొనవచ్చును స్వర్గీయ కాశీనాథుని నాగేశ్వరావు

పంతులుగారు అ, ఆల వరకు ప్రచురించి తొలి ఆంధ్ర సర్వస్వ సంపుటిలోని అభినయం అన్న అధ్యాయంలో తెనాలిపట్నానికి చెందిన నర్తకి నృత్యహస్తాలు ప్రచురింపబడ్డాయి. ఆమె ఎవరో ? ఈ పట్నంలోనే సిద్ధాబత్తుల రాఘవయ్య అనే ఒక ప్రసిద్ధ నాట్యాచార్యుడుండేవాడు. స్వర్గీయ లంకా సూర్యనారాయణ శాస్త్రి మొదలైన వారెందరో ఈయనవద్ద నృత్యశిక్షణను పొందారు.

శ్రీలంకా సూర్యనారాయణ శాస్త్రి నర్తకుడు, నాట్యాచార్యుడు, నాట్య శాస్త్రవేత్త, స్వతహాగా సంస్కృత పండితుడు. ఈయన చంద్రశేఖర కవి విరచితమైన భరతసార సంగ్రహాన్ని పరిష్కరించి ప్రచురించాడు

ఈ జిల్లాలోని పొన్నూరు, బాపట్ల పట్నాలలో గల భావనారాయణ ఆలయాల్లో నృత్యపూజ ఉండేది. చదలవాడలో నృత్యకళాకారు లెందరో ఉండే వారు. వీరంతా కర్నాటక ఆటలో ప్రసిద్ధులుగా ఉండేవారు. దుగ్గిరాల గూడా నర్తనకళకు ప్రసిద్ధిగాంచింది. చాలామంది నర్తకులు ఇక్కడనుండే తూర్పు గోదావరి జిల్లాలోని మండపేజకు వలసివెళ్లారు. ఈ ప్రాంతంలో కాకర్లవారి భాగవతరీతి, మైనంపాటివారి కర్నాటక భరతరీతి విరివిగా ప్రచారం పొందాయి.

కనిగిరిదుర్గం, కందుకూరు నృత్యకళకు ప్రసిద్ధిగాంచిన పట్నాలు. కందు కూరు జనార్దని ఆలయంలో నృత్యపూజ ఉండేది. కందుకూరు రుద్రకవి రచించిన సుగ్రీవ విజయం యక్షగాన రచనలో మొదటిదని కొందరు విమర్శకుల అభి ప్రాయం. ఇది యక్షగానాలలో మణిపూస. ఇతడు చేసినన్ని ఛందోరీతి ప్రయోగాలను మరే యక్షగాన రచయితా చేయలేదు. కందుకూరు జనార్దని పైని రచింపబడిన అష్టకాన్ని ఈ యాలయనర్తకులు అభినయించేవారు.

కావలిలోగూడ నర్తక కుటుంబాలు ఉండేవి. కందుకూరుపేట రెడ్లు భాగవత కళను పోషించి ప్రోత్సహించారు. శివుని కళ్యాణోత్సవాలలో "మృత్యుంజయ విలాస" కేళికలు ఇక్కడ ప్రదర్శింపబడేవి.

బుచ్చిరెడ్డిపాలెం, దొడ్లవారి సంస్థానంలోగూడ నృత్యకళ అభివృద్ధిచెందింది క్కడి ఆలయాలో నృత్యపూజ ఉండేది. "పెన్న దాటితే పెరుమాళ్లసేవ" అని ఒక నానుడి ఇక్కడ వినబడుతుంది. పెన్నానది తీరాన గల రంగనాధుని ఆలయంలో నృత్యసేవ జరిగేది.

సింహపురి జావళీలలోని శృంగారానికి కాస్త ఘాటు ఎక్కువే. ఐనా అభినయ కళాకారులకు ఇవి అత్యంత ప్రీతికరమైనవి. సంభోగ శృంగారాన్ని వర్ణించే పదాలను, జావళీలను సర్వసాధారణంగా ఎవ్వరూ సభల్లో ప్రదర్శించరు. సింహపురి రంగనాథునికి అంకితంగా రచింపబడిన "పట్టు వదలకురా ! పరవశ మగుచున్నది" అనే ఒకే ఒక సంభోగ శృంగార జావళిని నేను నేర్చుకొన్నాను. సింహపురి అంటే నేటి నెల్లూరు. ఈ నెల్లూరు కళాకారులకు మైనంపాటివారు భరత విద్యను నేర్పారట. ఈ కళాకారులలో ఏ యొక్కరైనా మనకు దొరికితే మైనంపాటివారి బాణీని మనం పునః సృష్టించవచ్చును. మైనంపాటివారిది ఒక విశిష్టమైన బాణీ. వీరు కేవలం నాట్యాచార్యులే కారు, ప్రసిద్ధ కవులు, గాయకులు, పండితులు. అంగువల్ల వారు వారి బాణీని విశిష్టంగా తీర్చిదిద్దుకొన్నారు.

నెల్లూరు మూలప్పేటలో వెలిసిన వేణుగోపాలుడు సంగీత ప్రియుడు. ఈ యాలయదాతలు సంగీతజ్ఞులను పోషించారు.

మార్కాపురంలో విష్ణుదేవునికి ఒక ఆలయముంది మీరు తప్పకుండా సందర్శించదగ్గ ఆలయ మిది "పరిశోధనకు తగినంత చారిత్రక విషయం ఇక్కడ దొరుకుతుంది. ఇక్కడ అపూర్వమైన శిల్ప ఖండాలున్నాయి అయితే ఇక్కడి వారికి వీటి విలువ తెలియదు. అందువల్ల ఇవి ఎండకు ఎండుతూ, వానకు తడుస్తూ కుప్ప కుప్పలుగా పడిఉన్నాయి. సప్తస్వర స్థంభాలు ఈ యాలయంలో ఉన్నాయి ఇవి విజయనగర ప్రభువుల కాలానివై యుండవచ్చును. ఈ యాలయం ఒకప్పుడు శైవాలయంగా ఉండి నర్తన పూజలందుకొంది. తర్వాత వైష్ణవాలయంగా మారి అభినయపూజ లందుకొంది. దేవాలయంలో ముందు భాగమంతా విజయనగర శిల్పశోభతో వెలుగొందుతూ ఉంటుంది. గర్భాలయం, బలిపీఠం

కాకతీయుల శిల్పంతో విరాజిల్లుతూ ఉంటుంది. ఈ రెండు రకాల శిల్పాలు ఒక దానితో ఒకటి పోటీపడుతున్నట్లుగా శోభిల్లుతూ ఉంటాయి. అయితే గుట్ట గుట్టలుగా ఆలయ ప్రాంగణంలో పడియున్న శిల్పాలు వాటి దీన స్థితికి విలపిస్తూ ఉంటాయి. పెన్నలోవున్న జొన్నవాడ కామాక్షమ్మ గుడిలో నృత్యపూజ ఉండేది. ఇప్పటికీ ఈ ప్రాంతంలో కొన్ని నర్తక కుటుంబాలు ఉన్నాయి.

మనుమసిద్ధి ఆస్థాన కవిగా నుండినా కవిత్రయంలోని తిక్కన కవి తన ఆంధ్ర మహా భారత రచనలో ఆనాటి నర్తన విద్యను వర్ణించాడు. కాటమరాజు కథలోగూడ ఆంధ్రుల నర్తన రీతులనుగురించి ఉంది.

వీరపల్నాడు సీమలోని చెన్నకేశవుని ఆలయాన్ని వీరభద్రుని ఆలయాన్ని మనం పరిశోధిస్తే మనకు వివిధ నర్తన రీతులగురించి తెలియగలదు.

ఇంక కొండవీడును గురించి చెప్పనక్కరలేదు. కొమరగిరి ప్రభువు, కర్పూర వసంతరాయలు "వసంత రాజీయం" అనే నృత్యశాస్త్ర గ్రంథాన్ని రచించాడు. కాళిదాసుని నాటకాలపైని కాటయవేముడు రచించిన వ్యాఖ్యానం, శ్రీనాథుని కావ్యాలు మన ప్రాచీన నాట్య రీతులగురించి తెలియజేస్తున్నాయి

కోటప్పకొండలో వీరశైవ మతము వికసించింది. ఇక్కడ వీరనాట్యాలు పోషించబడ్డవి. ఎవరైనా వీటిని గురించి పరిశోధించగలిగితే వీటి పుట్టుపూర్వోత్తరాలు, ప్రదర్శన తీరులు తెలియగలవు.

నేడు నాగార్జున కొండమీద మిగిలియున్న ప్రతి పాలరాతి శిల్పం ఒక కమనీయకావ్యం. ఈ కావ్యాలను ఎవరైనా ఓపికతో అధ్యయనం చేయగలిగితే ఆంధ్రనాట్యం గురించి ఎంతైనా తెలియగలదు. కాని దీనికి ఒకరి జీవితకాలం చాలదు.

ఆంధ్రమాత తన ఒడిలో నృత్యకళా చరిత నెంతో దాచుకొని ఉంది. దేవాలయాల్లోనే కాక కొండలు, కోనలలోగూడ ఇది నిక్షిప్తమైయుంది. జిజ్ఞాసులైన

నృత్యకళా చరిత్రకారులు దీనిని దీక్షతో ఓపికగా వెలికితీయగలిగితే మన ప్రాచీన నృత్యకళా సంపదపైని ఎన్ని సంపుటాలైనా వ్రాయవచ్చును.

సాగరసీమను వదలి మనం ముందుకు సాగేముందు ఒకముఖ్యమైన గమనిక :

ప్రస్తుత కాలంలో శ్రీకాకుళం జిల్లాతో ఆంధ్రప్రాంతం ప్రారంభమౌతుంది. కాని తెనుగునాట్యరీతి ఆంధ్రుల సంగీత బాణి పూర్వం కటక్, బరంపురం, గంజాం, కోరాపుట్టి జిల్లాలందు గూడా విశేషంగా ఉండినది. గంజాం కోరాపుట్టి జిల్లాలందు అనేక చిన్న చిన్న ఓఢ్ర జమీందారీ లున్నవి. జమీందారులు ఓఢ్రులైనా తెనుగు ఆటను పాటను యెక్కువగా ఆదరించారు, పోషించారు. ఎన్నో తెనుగు పాటలు ఒరియా భాషలోనికి సంగీతపద్ధతి సయితంగా తర్జుమా చేయబడినవి.

ఈ ప్రాచీన జమీందారీలన్నీ పర్యటించి - ఆ మహల్ లన్నీ సందర్శించి- వారి సరస్వతీ మందిరాలు పరిశీలించి, అక్కడ ప్రాచీన వ్రాతప్రతులు, తాళపత్రగ్రంథాలను మనం పరిశోధించాలి. ఇది చాలా అవసరం - ఎన్నో ప్రాచీన సంగీత రీతులు మనకు లభ్యమయ్యే అవకాశముంది. కొద్దికాలంలో ఈ కోటలు, పేటలు పూర్తిగా శిథిలమైపోతాయి.

# రాయలసీమ నర్తన శోభ

రాయ లేలిన సీమ రతనాల సీమ ఈ రాయలసీమ, ప్రాచీన కాలంనుండీ ఇక్కడ నృత్యకళ అభివృద్ధి చెందుతూ వచ్చింది. ఈ కళను పోషించిన దాతల గురించి, దీనిని ప్రాచుర్యంలోనికి తీసికొనివచ్చిన ప్రసిద్ధ నర్తకులగురించి తెలుసు కొనడం అవసరం. నాకు తెలిసినంతవరకు తెలియజేస్తాను. కాని తెలుసుకోవల సింది ఇంకా ఎంతో ఉంది యుంటుంది. ఇక్కడున్న ప్రతీ రాయీ, రప్పతో మనం ముచ్చటించగలిగితే రాయలసీమ నృత్యకళా చరిత్ర ఇంకా ఎంతో బయల్పడగలదు.

రాయలసీమ అనగానే మనకు విజయనగర సామ్రాజ్యం జ్ఞప్తికి వస్తుంది, శ్రీకృష్ణ దేవరాయలు స్ఫురణకు వస్తాడు. భువన విజయం మన కళ్ళకు కడు తుంది. అష్టదిగ్గజాలు, కవి, పండిత, గాయక, నర్తక శ్రేష్ఠులతో శ్రీకృష్ణ దేవ రాయలు కొలువు తీరి యుండగా, తన కవితా స్ఫూర్తితో ఆయన ప్రశ్నకు సమా ధానం చెప్పి, అప్పాజీ చేత భేష్ అనిపించుకొని, తాతాచార్యులవారి మన్ననల నందుకొని, తన ఎడమ కాలుకు నవరత్నాలు పొదిగిన గండపెండేరాన్ని స్వయంగా రాయలువారిచేత పెద్దన్నగారు తొడిగించుకొన్న దృశ్యం జ్ఞప్తికి వస్తుంది. ఈ దృశ్యాన్ని ఆనాడు మనం కళ్లారా చూడక పోయినా అది మన కళ్లకు కడుతుంది.

రాయలువారి మహల్లో నృత్యశాల ఉండేది. ఆ నృత్యశాలలో నృత్య శిల్పాలు వివిధ భంగిమల్లో ఉండేవి. ఆయన కాలంలో వసంతోత్సవాలు కడు వేడుకగా జరిగేవి. ఆ వేడుకల్లో నృత్య కేళికలు ప్రధానంగా ఉండేవి. వీటిని చూసే భాగ్యం మనకు కలగక పోయినా విదేశీ సందర్శకులు వీటిని వర్ణిస్తూ మన కోసం వ్రాసి పెట్టారు.

ఘనత కెక్కిన ఆ రాయలువారి సభలో రాజ నర్తకి రంజకం కుప్పాయి లాస్య నర్తనం చేసి వారిని మెప్పించేది. ఈమె పేరు రాయలుసీమ చరిత్రలో శాశ్వతంగా నిలిచిపోయింది. ఈమె లాస్య నర్తనం ఎంత గొప్పదో గదా! ఆ విదేశీ సందర్శకులు మన కన్నా ధన్యులు. ఈమె తండ్రి "విద్వత్సభా రంజక" రంజకం శ్రీ రంగరాజు. ఈయన ఒక గొప్ప నాట్యాచార్యుడు. "రంజకం" అన్నది వీరికి నాట్యంలో వచ్చిన బిరుదు.

తల్లికోట యుద్ధానంతరం విజయనగర సామ్రాజ్యం పతనమైపోయింది. ఈ రాజవంశీయులు విజయనగరాన్ని వదిలిపెట్టి చంద్రగిరిని రాజధానిగా చేసుకొన్నారు. చంద్రగిరి ఆస్థానానికి చెందిన ప్రసిద్ధ నర్తకి ముద్దు చంద్రరేఖ.

తంజావూరు నేలిన రఘునాథ భూపాలుడు ఒక యుద్ధంలో చంద్రగిరి రామరాయలుకు సహాయపడ్డాడు. ఆ యుద్ధంలో రామరాయలు విజయలక్ష్మిని చేపట్టాడు. శత్రువులు నాశనమయ్యారు. ఈ సంతోష సమయంలో తన విజయ చిహ్నంగా ఏదైనా ఒక బహుమతిని రఘునాథ నాయకునికి రామరాయలు ఇవ్వ దలచి, ఆయన్నే కోరుకోమన్నాడు. రఘునాథ నాయకుడు రణరంగ నిపుణుడే కాడు, కవి, సంగీత శాస్త్రాన్ని బాగా ఎరిగినవాడు. నాట్యశాస్త్ర కోవిదుడు. లలితకళా సంపన్నుడు. సిరి సంపదలు గలవాడు. ఆయనకు అన్నీ ఉన్నాయి గాని ప్రవీణురాలైన రాజ నర్తకి ఆయన ఆస్థానంలో లేదు. అందువల్ల రామరాయలు ఆస్థాన నర్తకైన ముద్దు చంద్రరేఖను తన ఆస్థానానికి బహూకరించమని ఆయన రామరాయల్ను కోరాడు. ఆయన సంతోషంతో అంగీకరించాడు. కాని ముద్దు చంద్రరేఖ అందుకు మూడు షరతులు విధించింది. ఆ షరతులకు రఘునాథ నాయకుడు సరసతతో అంగీకరించాడు.

రఘునాథ నాయకుని దర్బారుకు ముద్దు చంద్రరేఖ తన ఇంటినుండి వెళ్ళి రావడానికి ముత్యాల పల్లకీని పంపించాలి. పగటి దివిటీలవారు ఆ పల్లకీ ముందు నడవాలి. బిరుదు మిటారులు రాయలువారి పేరును, తన పేరును స్తోత్ర గీతాలతో ఆలపిస్తూ తన పల్లకీ వెంట నడవాలి. అప్పుడు ఆమె ఇందిరా మందిరానికి వెళ్ళి

సరస్వతీ సదనంలో నాట్యమాడుతుంది. ఇవీ ఆమె విధించిన షరతులు, ముద్దు చంద్రరేఖ నృత్య కళావేత్త, రఘునాథ నాయకుడు సరసుడు గనుకనే ఆయన ఆ షరతులకు అంగీకరించాడు. ఆమె చంద్రగిరి ఆస్థానం నుండి తంజావూరు ఆస్థానానికి వెళ్లింది.

రామ రాయలు పరిపాలనానంతరం రాయల రాజ్యం ముక్క చెక్కలై, చిన్న, చిన్న జమీందారీలు ఏర్పడినాయి. వీటిని వెలమ దొరలు, క్షత్రియులు పరిపాలించారు. వీరిలో కార్వేటి నగర ప్రభువులు, కాళహస్తి దామెర వంశీయులు, వెంకటగిరి వెలుగోటివారు, బనగానపల్లి నవాబులు ముఖ్యులు.

కలియుగ దేవుడైన శ్రీనివాసునికి తన కుమార్తె పద్మావతిని ఇచ్చి, పెండ్లిచేసి మహావిష్ణువునే ఆంధ్రులకు అల్లుని గావించి, ఏడు కొండలను ఆయనకు కట్నంగా ఇచ్చినవాడు కార్వేటి నగర సంస్థానాధీశుడు ఆకాశరాజు. ఆ శ్రీనివాసుడు వేంకటేశ్వరుడుగా తిరుమల కొండపైని వెలిసి వెంకన్న బాబుగా సకల పూజలను నిత్యం అందు కొంటున్నాడు.

పూర్వం ఈ కార్వేటి నగర రాజులు నగరి నారాయణ వనంలో ఉండేవారు. తర్వాత కార్వేటి నగరాన్ని తమ రాజధానిగా చేసుకొన్నారు. వీరు క్షత్రియులు. గోపాలుడు వీరి ఇలవేల్పు. నృత్య సంగీత కళలను వీరు ఆదరించి పోషించారు.

పెద్ద వర్ణాలు (గోవిందసామయ్య పంచకం) రచించిన గోవిందసామయ్య వీరి సంస్థానంలోనే ఉండేవారు. వీరు రచించిన అయిదు పెద్ద వర్ణాలలో మోహన వర్ణం ఎంత ప్రసిద్ధమైందో అంత కష్టమైంది. దీనిలోని సాహిత్యానికి ఆంగిక, సాత్వికాభినయాలను ప్రదర్శించడం నృత్యకళాకారులకు ఒక పరీక్షవంటిది.

సారంగపాణి అనే కవి కూడా కార్వేటినగరం వాడే. ఈయన ఇక్కడున్న వేణుగోపాల స్వామి కంకితంగా పదాలు రచించాడు. ఇవి చిత్రవిచిత్రమైన పదాలు. వీటిలో కొన్ని సంగీతపరమైనవి, కొన్ని వైరాగ్యపరమైనవి, కొన్ని నృత్యాభినయపరమైనవి. ఇవి పలు రీతుల్లో ఉన్నాయి. ఈ పదాలను పూర్వం

కార్వేటినగర ఆస్థాన నర్తకులు ప్రదర్శించేవారు. ఈ సంప్రదాయాన్ని తెలిసిన వారిలో పాటకం అమ్మాణి అనే ఒక వృద్ధ నర్తకి చెంగల్పట్టు జిల్లాలోని కరీం బీడులో ప్రస్తుతం ఉన్నారు.

వాయు లింగమూర్తి వెలిసిన పవిత్ర శైవ యాత్రాస్థలం శ్రీకాళహస్తి. దామెర వంశీయులు పరిపాలించిన ప్రాంత మిది. వీరి ఆస్థానంలోను, ఈ ఆలయంలోను నర్తన ముండేది. ఈ యాలయంలో నృత్యపూజలు చేసిన నర్తకులలో చివరి ఆమె మా గురువుగారైన నాయుడుపేట రాజమ్మగారు. నాట్యవిద్యా ప్రవీణుడైన విద్యల నారాయణస్వామి నాయుడుగారు గొప్ప నాట్యాచార్యుడు. ఈయన నట్టువయై ఈమె కేళికలను నిర్వహించేవారు. ఈయన కవిగా, గాయకుడుగా కూడా ప్రసిద్ధిగాంచినవాడు. "విద్యల" అన్నది వారి బిరుదు. వారి ఇంటిపేరుగా ఈయనవలన సార్థకనామమైంది.

శ్రీ తిరుపతి వేంకటేశ్వరునికి అంకితంగా అధ్యాత్మరామాయణ కీర్తనలను రచించిన మునిపల్లె సుబ్రహ్మణ్యకవి ఈ కాళహస్తి ఆస్థానానికి చెందినవాడే.

"రార ! నీవు రార ! యదువంశకులాంబుధిచంద్ర" అని కృష్ణ శబ్దంగా మన కూచిపూడివారు నేడు ప్రదర్శిస్తున్నది కాళహస్తి సంస్థానాధీశుడైన పెద్ద వేంకటేంద్రుని పరంగా రచింపబడిన దానికి ప్రతిరూపం. "రార ! నీవురార ! దామెర తిమ్మేంద్ర కుమారా !" అన్నది అసలు రచన. ఈ శబ్దంలో పేర్కొనబడిన తిమ్మ భూపాలుని కుమారుడు పెద్దవేంకటేంద్రుడు కవి, పండిత గాయక, నర్తక పోషకుడు.

వేంకటగిరి బంగారేచ భూపాలుడు సంగీత, నృత్య కళాపోషకుడు. ఆంధ్ర గీర్వాణ భాషల్లో రచింపబడిన అనేక పదాలు ఈయనకు అంకితంచేయబడ్డాయి. సర్వజ్ఞ కుమార యాచేంద్రులవారు ఒకసారి, ఒక గొప్ప నృత్య సంగీత సదస్సును నిర్వహించారు. ఈ సదస్సుకు ఉత్తర, దక్షిణ భారతదేశ సంగీతజ్ఞులు, నాట్యాచార్యులు, నర్తకశ్రేష్ఠులు వచ్చారు. దక్షిణ భారతావనిలో

భారీఎత్తున జరిగిన చివరి సదస్సు ఇదే. ఉత్తర, దక్షిణ సంగీత, నృత్య సాంప్రదాయక రీతులగురించి ఈ సదస్సులో చర్చించారు. ఆ చర్చల వివరాలు "సభారంజని" అనే గ్రంథంగా తర్వాత ప్రచురింపబడినాయి.

"చర్మకట్టు వాద్య" మనే ఒక ప్రక్రియను వెంకటగిరి ప్రభువులు పెంపొందించడం ఒక విశేషం.

రాజబాటకు ఇరుప్రక్కలా నలభైమంది డోలు వాయిద్యకులు, నలభై మంది సన్నాయి వాయిద్యకులు నిలబడి వారి వాయిద్యాలను మ్రోగిస్తుంటే మధ్యలో సుమారు వందమంది నర్తకీమణులు ధవళ వస్త్రాలు ధరించి, నాట్యం చేసేవారు. వీరి వెనుక నాట్యాచార్యు లుండి తాళం వేసేవారు. కార్వేటినగర గోవిందసామయ్య రచించిన మోహన వర్ణం ఈ నాట్యానికి ఆధారంగా ఉండేది. దేవుని ఊరేగింపులో జరిగే ప్రత్యేక సంగీత, నృత్య విన్యాస మిది. ఈ వేంకటగిరి ప్రభువు లందరికీ ఈ వర్ణం సుపరిచితమైంది గనుక ఈ ప్రదర్శనలో ఎవరు ఏమాత్రం పొరపాటు చేసినా వారికి దేవిడీమన్నా జరిగేది. ఈ ఉత్సవానికి మూడు నెలల ముందు నుండీ ఈ వర్ణాన్ని అందరూ సాధన చేసేవారు. ఇదొక గొప్ప ప్రయోగం. అన్ని ప్రాంతాలనుండి తండోప తండాలుగా జనం వచ్చి ఈ ప్రదర్శనను చూసేవారు.

సూళ్ళూరు పేట చేరువలో నున్న మన్నారు పోలూరులో రంగనికి ఆలయ ముంది. ఈ యాలయంలో నృత్యపూజ జరిగేది. ఈ యూరిలో అనేక మంది నర్తకులు ఉండేవారు ఆలయ, కర్ణాటక కచ్చేరీ బాణీలు రెండూ ఈ నర్తకులకు తెలిసియుండేవి. ఆలయనర్తకులు తప్ప ఇతరులు వేంకటగిరి సంస్థానానికి వెళ్లి కేళికలు జరిపేవారు.

పుంగనూరు ఒక చిన్న సంస్థానం. ఈ సంస్థానాధీశులు గూడా నృత్య కళను పోషించారు. సంప్రదాయసిద్ధమైన నృత్య కళాకారులు సత్యవీడులో కూడా ఉండేవారు. రాయలువారి కాలంనాటి శిల్పసంపదగల ఒక ఆలయం నాగలా

పురంలో ఉంది. పూర్వం ఈ ఆలయంలో నృత్యపూజ జరిగేది. ఆగమ శాస్త్రాల అనుసారం ఈ నృత్యపూజ నిర్వహింపబడేది.

పుల్లంపేటలో మహాలక్ష్మి అనే ఒక ప్రసిద్ధ నర్తకి ఉండేది. ఈమె నాయుడుపేట రాజమ్మగారి బంధువు.

పెంచలకోన నరసింహస్వామి వారి ఆలయంలో నృత్యపూజ ఉండేది. కలువాయికి చెందిన గుడిగుంట నాగమణి ఆమె సోదరీమణి ఈ నృత్యపూజలో పాల్గొన్న చివరి దేవనర్తకులు. ఆలయాల్లో నృత్యపూజ నిషేధింపబడిన అనంతరం నాగమణమ్మ నెల్లూరులో స్థిరపడి అనేకులకు నృత్యశిక్షణ ఇచ్చారు. ఈ మధ్యనే ఆమెకు పక్షవాతంవచ్చి, మరణించింది. ఈమె నాయుడుపేట రాజమ్మగారివద్ద నృత్యాన్ని అభ్యసించారు.

పొద్దుటూరు నృత్యకళకు ప్రసిద్ధి. వెల్లాల లక్ష్మీకాంతమ్మ అనే ఒక ప్రసిద్ధ నర్తకురాలు ఇక్కడ ఉండేది. మదరాసు రాష్ట్ర గవర్నర్‌గా ఉండిన సర్ ఆర్థర్‌హోప్ ఈమె నృత్యప్రదర్శనను చూసి, మెచ్చుకొని ఈమెకు ఒక బంగారు పతకాన్ని బహూకరించారు. ఒకసారి భారతదేశ ప్రముఖ మల్లయోధుడు షేర్‌ఖాన్ ఈమె నృత్యప్రదర్శనను చూసి, ముగ్ధుడై "వారేషేర్ ! నేను కుస్తీలో షేర్ అయితే నీవు నృత్యంలో షేర్ !" అంటూ ఆయన గెల్చుకొన్న ఒక బంగారు పతకాన్ని ఈమెకు బహూకరించాడు. ఆనాటి నుండి ఈమె షేర్ వెల్లాల లక్ష్మీకాంతమ్మగా పేరు ప్రఖ్యాతులు పొందింది.

బనగానపల్లి నవాబుల గొప్ప నృత్యకళా పోషకులు. వీరి జమీందారీలోని కోయిలకుంట్ల గ్రామం నాట్యానికి ప్రసిద్ధి. ఇక్కడ ఎందరో నృత్యకళాకారులు ఉండేవారు. వీరిలో పేరు ప్రతిష్టలు గడించినవారు శ్రీమతి ఎర్రలక్ష్మిగారు. ఇక్కడి నృత్యకళాకారు లందరూ "తపా" అనే ప్రత్యేక నృత్య బాణీని ప్రదర్శించడంలో ప్రసిద్ధులు. ఈ బనగానపల్లి నవాబుల పోషణలో ఈ బాణీ వృద్ధిపొందింది.

ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన శిల్పకళా నిలయం లేపాక్షిలో ఉంది. ఈ శిల్పనిలయం నిండా నృత్యభంగిమలు అనేక మున్నాయి. ప్రస్తుతం ఇక్కడ నృత్యం లేకపోయినా ఒకనాటి రాయలసీమ నృత్యకళా విశిష్టతను చాటిచెప్పే అద్భుత నృత్యశిల్పాలు ఈ లేపాక్షి ఆలయంలో ఉన్నాయి.

దేవునికడపలో ప్రసిద్ధమైన వేంకటేశ్వరుని ఆలయ మొకటి ఉంది. ఇక్కడ నృత్యపూజ ఉండేది వేంకటేశ్వరుని భక్తుల్లో ప్రసిద్ధుడైన తాళ్లపాక అన్నమాచార్యుడు తాళ్లపాక గ్రామానికి చెందినవాడు. సంకీర్త సంగీత సంప్రదాయానికి శ్రీకారం చుట్టి కొన్నివేల పదాలు, కీర్తనలను ఈయన రచించాడు. చందమామగీతాలు, అల్లోనేరళ్లు, జాజరిగీతాలు మొదలైన ఎన్నో శైలుల్లో సంగీత రచనలు చేసి, భావి తరాలవారికి మార్గ దర్శకులుగా అఖండ కీర్తిని పేరు సంపాదించారు. ఈయన సృజించని సంగీత రచనా రీతి దక్షిణాది సంగీతంలో లేదు. అందువల్లనే ఈయన సంగీతజ్ఞులకు ఆరాధ్యుడైనాడు.

తరికొండ వెంకమ్మ గొప్ప జ్ఞాని. ఈమె వైష్ణవ భక్తురాలు. పిండోత్పత్తి విషయం ప్రధానంగా గల గొల్ల వేష కథను ఒక సంగీత పారిజాతంగా ఈమె రచించింది. ఆనాటినుండి నేటివరకూ కూడా నర్తకులు దీనిని ప్రదర్శిస్తూనే ఉన్నారు.

తిరుపతి ఆలయానికి చెందిన మహంతులు "సుంకరి కొండని" కలాపాన్ని రచన చేయించి, ప్రచారంచేశారు. మారువేషంలో నున్న తిరుపతి వెంకన్న ఈ సుంకరి కొండడు.

కర్నూలులో నట్టువ వీధి ఒక టుంది. పూర్వం ప్రసిద్ధ నట్టువరాండ్రు నాట్యకళా వేత్తలు ఈ వీధిలో ఉండేవారు గనుకనే ఈ వీధి కాపేరు వచ్చింది. నట్టువ ఇందిర ప్రసిద్ధ హరికథా కళాకారిణి. ఈమె పూర్వీకులు కర్నాటక కచ్చేరీ ఆటనేగాక మేనక సంప్రదాయ నాట్యాన్నిగూడా ప్రదర్శించేవారు. మేనక సంప్రదాయ నాట్యమంటే మట్టికుండలపైని నాట్యమాడడం, తలమీద చెంబులు

మొదలైనవి పెట్టుకొని, నీళ్లపళ్లెం అంచులపైని నిలబడి, చేతులలో జ్యోతులు పెట్టుకొని నాట్యం చేయడం, నాట్యంచేస్తూ మొగ్గలు వేయడం, ప్రత్యేక భ్రమణాలను ప్రదర్శించడం

ఒకప్పుడు బళ్లారి జిల్లా రాయలసీమలో ఒక భాగంగా ఉండేది. కాని ప్రస్తుతం అది కర్నాటక రాష్ట్రంలో ఉండడంవల్ల ఆ జిల్లాలోని నాట్యకళను గురించి ఇక్కడ తెలియజేయడంలేదు. ఈ ప్రాంతంలో పారిజాతా లన్న పేరుతో భామాకలాపాలను ప్రదర్శిస్తూ ఉంటారు. మన కలాపాల ప్రభావంవల్లనే ఈ ప్రాంతంలోనే గాక హుబ్లీ, ధార్వార్, బెల్గాం మొదలైన కర్నాటక ప్రాంతాలలో గూడ పారిజాతాలు ప్రదర్శింపబడుతున్నాయి.

రాయలసీమ ప్రాంతంలో రెండు విశిష్ట భాగవత సంప్రదాయా లున్నాయి. బనగానపల్లి నవాబులు సాగరసీమనుండి కొంతమంది భాగవత కళాకారులను రప్పించి వారికి కోటకొండ కపట్రాల గ్రామంలో కొన్ని భూముల నిచ్చి, వారి స్థిరనివాసానికి తగిన సౌకర్యాలను కల్పించారు, ఈ వలసవచ్చిన సాగరసీమ కళాకారులు రాయలసీమలో భాగవతకళను ప్రచారంచేశారు.

అహోబిలం ఒక ప్రసిద్ధ వైష్ణవ క్షేత్రం. ఇక్కడే నరసింహావతారుడైన మహావిష్ణువు హిరణ్యకస్యపుని సంహరించాడు. ఆ సంధ్యవేళ తన ఉగ్రరూపాన్ని ఉపసంహరించుకొనలేక కర్నూలు అరణ్య ప్రాంతాలలో భయంకరంగా తిరుగాడుతున్న సమయంలో చెంచులక్ష్మి అతని ముందు ప్రత్యక్షమయింది. ఆ యందకత్తెను చూసి, మోహితుడై తన కోపాన్ని మరిచిపోయి, ప్రసన్నవదనంతో ఆమెను చేరి, ప్రణయకలాపం సాగించాడు తర్వాత ఆమెను పెళ్లి చేసికొన్నాడు. ఈ కథ గరుడాచల యక్షగానంగా రూపొందింది. చెంచులక్ష్మి నాటకంగాగూడా పలువురు వ్రాశారు. ఈ యక్షగానం, ఈ నాటకాలను ఆంధ్రప్రాంతంలో తరచుగా ప్రదర్శిస్తూ ఉండేవారు. ఈ యక్షగానాన్ని ప్రదర్శించడంలో అహోబిలానికి చెందిన పౌతకమూరు భాగవతులు ప్రసిద్ధులు. ఈ భాగవతులు గొప్ప పండితులు, పరమవైష్ణవ భక్తులు. ఈ పౌతకమూరు భాగవతులే తంజావూరు

వెళ్లి అచ్యుతప్ప సమక్షంలో భాగవతాలను ప్రదర్శించి, కేళికలు జరపారు. ఆ మహారాజు వీరికి ఒక గ్రామాన్ని ఇనాంగా ఇచ్చి, వీరికి స్థిరనివాసం ఏర్పాటు చేశాడు. ఆ గ్రామానికి అచ్యుతాపురం అన్న పేరుపెట్టుకొని ఈ మేళాంవారు అక్కడ ఉండిపోయారు. అచ్యుతాపురం మేళాలు ఉండేవారు గనుక దానికి మేళట్టూరు అన్న పేరు తర్వాత వచ్చింది. అని పెద్దల అభిప్రాయం.

నేటికి ఆ యచ్యుతాపురంలో నారసింహజయంతి ఘనంగా జరుగుతూ ఉంది. ఈ భాగవతులు ఆ నరసింహమూర్తి భక్తులు గనుక ఈ నరసింహ జయంతిని కడు శ్రద్ధతో మహావైభవంగా నిర్వహిస్తున్నారు. నాట్యకళాకారులు ఒక్కసారైనా ఈ నరసింహ జయంతి ఉత్సవాలను చూసితీరాలి. ఈ మేళట్టూరు నాట్యకళాకారులకు ఒక యాత్రాస్థలం,

లేపాక్షి రా మా య ణా న్ని, జంత్రీకిదలను ప్రదర్శించే ప్రసిద్ధ నాట్యబృందాలవారు చాలా మంది పూర్వం రాయలసీమలో ఉండేవారు. రాను రాను వీరు తగ్గిపోయి చివరకు ఒకే ఒక జట్టువారు నేడు అక్కడ మిగిలి యున్నారు. ఈ జట్టువారు గూడా కడు బీదవారు. వీరిని ప్రజలు ప్రభుత్వం పోషించకపోతే లేపాక్షి రామాయణాన్ని ప్రదర్శించగలవారు మరి అక్కడ ఉండరు.

సాగరసీమలోని కూచిపూడి భాగవతుల వంటివారే రాయలసీమలోని కొత్తయిండ్ల వీధి నాటక కళాకారులు. కూచిపూడి కళాకారులు బ్రాహ్మణులు, కొత్తయిండ్ల కళాకారులు బలిజనాయుళ్లు. సుమారు మూడువందల కొత్తయిండ్ల కుటుంబాలవారు ఈ భాగవత కళను ఆరాధిస్తున్నారు. భారతంలోని పద్ధెనిమిది పర్వాలను వరుసగా పద్దెనిమిది రోజులు ప్రత్యేకంగా ప్రదర్శించగల సమర్థులు వీరు. మహాభారతాన్ని వీరిచేత కేవలం వినోదార్థం అక్కడ ఆడించరు. దానిని ఒక క్రతువుగా భావించి ఆడిస్తారు.

చక్కగా పాడి, ఆడి, అభినయించడంలో వీరికి వీరే సాటి. ఈ భాగవత కళ వారి సొత్తు పూర్వం అలంకరణా విధానాన్నే నేటికి వీరు పాటిస్తున్నారు.

వీరిది ప్రాచీన సంగీత బాణీ. ప్రాచీన వీధినాటక బాణీని వీరొక్కరే కాపాడు కొంటూ వస్తున్నారు.

ఈ కొత్తయిండ్ల భాగవతులు రాయలసీమ ప్రాంతంలోనేగాక బెంగుళూరు, తంజావూరు ప్రాంతాలక్కూడా వెళ్లి నేటికి ప్రదర్శనలు ఇస్తుంటారు.

ఒక ముఖ్య గమనిక- "ఆనెగొందె" అనే సంస్థాన ముంది. విజయ నగర రాయలవారికి చెందిన వంశీయులు అచ్చట వున్నారు.

వారి వద్ద ప్రాచీన నాట్యగ్రంథాలు ఏమైనా దొరకవచ్చును. నేను ఎన్నో సార్లు ప్రయత్నించాను కాని వారి ఆస్థాన సరస్వతీ భాండాగారాన్ని సందర్శించే అవకాశం నాకు కలుగలేదు.

అనంతపురం జిల్లా పర్యటనలో నేను కలిసికొన్నట్టి వృద్ధ కళా మూర్తులు. కోటకొండ కిష్టయ్యగారి శిష్యురాండ్రు - శ్రీమతులు భీమక్క (ఎమ్మిగనూరు)- శివమ్మ (అనంతపురం). వీరిరువురూ సోదరీమణులు. కృష్ణలీలలు ప్రత్యేకంగా ప్రదర్శించేవారట

శ్రీమతి ఆలివేలమ్మ - బిల్లముత్తూరు (లేపాక్షి అద్దరి) కోల్లారు జిల్లా చిల్లగుంటలో అరవై కుటుంబాల కళాకారులున్నారు. వారంతా నాట్యవిద్యనుండి విరమించారు. వారు కర్నాటక మాడేవారట - పారిజాతాలు అలవాటులో లేవు వారివద్ద మనకు ప్రాచీన వ్రాతప్రతులేమైనా దొరకవచ్చును.

# తెలంగాణా నృత్య వైభవం

"పాందాన్ చూసి ఖాందాన్ చెప్పవచ్చును" అని మూడు నాలుగు దశాబ్దుల క్రితం తెలంగాణా కళాకారు లంటూ ఉండేవారు. నిజంగా ఆ పాన్‌దాన్లు చిన్ని చిన్ని కళానిలయాలు వెండి నగిషీలతో, బంగారు పూతలతో, శిల్పభంగిమలతో, లతలతో, పూలతో, దేవతా విగ్రహాలతో అవి ఎన్నోరకాలుగా వెలిగిపోతూ ఉండేవి. తెలంగాణా విశ్వకర్మలు వీటిపైని చిత్రవిచిత్రాలు సృష్టించేవారు. వాటిని వర్ణించడానికి వీలులేదు. చూసితీరవలసిందే.

పాన్‌దాన్ అంటే తాంబూల సరంజామాను పెట్టుకొనే చిన్న పెట్టె. దీనికే ఇంత విలువ ఉంటే ఇంక తాంబూలాన్ని కట్టి ఇవ్వడం, దానిని సేవించడం ఎంత కళాత్మకంగా ఉండేవో! రకరకాల సుగంధ ద్రవ్యాలతో, బంగారు, వెండి రేకుల అద్దకంతో చూడ్డానికి సేవించడాకీ కూడా ఆ తాంబూలం బాగుండేది. అది సంపూర్ణమైన తాంబూలం. ఈ సుగంధ ద్రవ్యాలకు తోడు ఆ తమల పాకులుగూడా అంత రుచిగా ఉండేవి. వీటన్నికీ ఒకొక్క అర ప్రత్యేకంగా ఉండేది. అందువల్ల ప్రతి పాన్‌దానూ అడుగు, అడుగున్నర ఎత్తు ఉండేది. ఇక పాన్‌దాన్ గురించి ఆపి ఖాన్‌దాన్ గురించి చెప్తాను.

ఇటువంటి పూర్ణ తాంబూలాన్ని సేవించి, ఎరుపెక్కిన పెదవులతో, కంచు గంటలా, కిన్నెర కంఠంలా, వీణా నాదంలా, మురళీరవంలా, కోయిల స్వరంలా మధురంగా, అతి మధురంగా, సుస్నితంగా, శ్రుతి లీనంగా, అందంగా, ఆనందంగా ముద్దుగా మురిపిస్తూ తమ మధుర కంఠాలను తంబూరా నాదంతో మేళవించి తెనుగు, ఉర్దూ, సంస్కృతం, పార్శీ అరబీ, మరాఠీ భాషల్లో పదాలను జావళీలను, తరంగాలను అష్టపదులను ట్ర్రుమీలను, గజళ్లను, రుబాయితులను, అభంగాలను తెలంగాణా నర్తకీమణులు పాడేవారు, అభినయించేవారు.

వీరు సాధారణంగా కూరు్నే పాడుతూ అభినయించేవారు సభికులు కోరితే వీరు నిల్చొని అడవులను ప్రదర్శించేవారు. ఈ కళాకారులది ఒక అద్భుతమైన బాణీ, ఒక అపూర్వమైన సంప్రదాయం.

దేశాన్ని బట్టి, దానిని పాలించే ప్రభువును బట్టి, అభిమానించే రసిక ప్రేక్షకులను బట్టి నృత్య కళాకారులు తమ నృత్యకళను అభ్యసించి, ప్రదర్శించే వారు అయితే ఇదంతా ఆస్థాన కచేరీఆట తీరు.

ధర్మపురి, వేములవాడ, బర్గాల్ మొదలైన దేవాలయాల్లోని కళాకారుల కేళికల తీరు వేరేగా ఉండేది ఇవి అగమరీతిని అనుసరించి ఉండేవి. ఇవి కాక ప్రజా కళలు వేరుగా ఉండేవి.

ఈ కళాకారులు తెలుగు, సంస్కృత భాషలందే కాక ఉర్దూ, పార్సీ భాషల్లోగూడా చక్కని పాండిత్య ప్రతిభ గలిగి యుండేవారు. వీరి ఆచార వ్యవహారాలు, భోజన పద్ధతులు సంస్కారవంతంగా ఉండేవి.

త్రిలింగదేశం విభిన్న సంస్కృతులు గల దేశం. వివిధ సంస్కృతుల లోని మంచినంతటిని ఏరికూర్చిన ఉత్తమ సంస్కృతిగల దేశం త్రిలింగదేశం. అందువల్లనే ఇతరులకు ఆదర్శవంతులైనారు మన ప్రాచీనులు.

ఇరుగు పొరుగు నున్న ఓడ్రులు, తమిళులు, కన్నడిగులు, మహారాష్ట్రులు, గోండులు కోయలు, చెంచులు, మహమ్మదీయుల సంస్కృతిలోని మంచినే గాక బహుదూర దేశవాసులైన రోమన్ల, గ్రీకుల సంస్కృతిలోని మంచిని గూడా గ్రహించి, దానిని జీర్ణించుకొని తమ సొంతం చేసికొన్నారు మన పూర్వులు కనుకనే ఆంధ్రేతరులు ఆంధ్రులతో పొరపొచ్చాలు లేకుండా, కలిసిమెలిసి సుఖజీవనం గడప గలుగుతున్నారు ఆంధ్రులది విశాల హృదయం, విశాల దృక్పథం.

రాయలసీమలోని కర్నూలుకు ఉత్తర దిక్కుగా నున్న తుంగభద్రానదిని దాటితే తెలంగాణా ప్రాంతం ప్రారంభమౌతుంది. ఈ నది ఉత్తర తీరాన పుణ్యక్షేత్రం అలంపురం ఉంది. దీనిని దక్షిణ కాశీ అంటారు.

ఈ క్షేత్రంలో నవబ్రహ్మాలయాలు ఉన్నాయి శక్తి పీఠాలలో ముఖ్యమైన జోగులాంబపీఠం ఇక్కడే ఉంది. ఈ దేవతకు అంకితమైపోయిన పంచమ కుల కన్యలే జోగువారు, జోగితలు, జోగీయలు. ఈ జోగితలు నృత్యమభ్యసించి, వారి తెగలవారి వినోదార్థం నృత్య ప్రదర్శనలు ఇస్తూ ఉంటారు. వీరు రేణుకా దేవి బిడ్డల మని చెప్పుకొంటారు.

జమదగ్ని తన భార్యను నరికివేయు మని విశ్వామిత్రుణ్ణి ఆజ్ఞాపిస్తాడు. ఆమె తప్పించుకొని పారిపోతుంది. ఆమెను విశ్వామిత్రుడు వెంటాడుతాడు. ఆమె వెళ్లి, వెళ్లి ఒక పంచముని శరణుజొచ్చి అతని యింట ఉండిపోయింది. తర్వాత ఆమె ఒక దేవిగా వెలిసింది.

మన ఆంధ్రదేశమంతటా కన్నమ్మ పేరంటాళ్లు, మహాలక్ష్మి పేరంటాళ్లు కామమ్మలు వెలిసి ఉన్నారు. వీరందరికీ పెద్దది ఆదిశక్తియైన అంబ ఈ యమ్మవార్లందరూ ఆమె రూపాలుగానే ప్రజలు భావిస్తూ ఉంటారు. అందువల్లనే పేరాంటాలుగా వెలిసిన ప్రతిదేవిని గౌరీదేవిగా ప్రజలు ఆరాధిస్తూ ఉంటారు.

అలంపురం శక్తిపీఠం చాలా ప్రసిద్ధమైంది. అందువల్ల ఈ జోగులాంబకు అర్పించబడిన ఆడబిడ్డలు అందరూ జోగులాంబలే.

కర్నూలువద్ద తుంగభద్రానదిని దాటగానే అలంపురంతో మహబూబ్‌నగర్ జిల్లా ప్రారంభమౌతుంది. దీని తరువాత గద్వాల, జటప్రోలు, కొల్లాపురం, వనపర్తి హైందవ సంస్థానాలు ఉన్నాయి. ఈ సంస్థానాలలో కర్నాటక బాణీ నృత్యకళ పోషింపబడింది. అయితే అది ప్రస్తుతం అక్కడ అంతరించిపోయింది.

భృగుమహర్షి విష్ణువు గుండెలపై తన్ని అవమానించినా విష్ణువు కోపగించ లేదని లక్ష్మీదేవి అలిగి భూలోకానికి వచ్చింది. ఆమె కొన్నాళ్లు కొల్లాపురంలో

ఉండిపోయింది. మహావిష్ణువు ఆమెను భూలోకంలో వెతుకుతూ తిరుపతి కొండలు చేరుకొన్నాడు. లక్ష్మీదేవిని అన్వేషిస్తూ ఉంటే ఆయనకు పద్మావతీదేవి కనబడింది. ఆమెను ప్రేమించి, పెళ్లి చేసుకొనా లనుకొన్నాడు ఆ విష్ణుమూర్తి. ఆయన ఎరుకల సాని వేషం ధరించి, నృత్యం చేస్తూ, ఆమెకు సోది చెప్పి, వకుళాదేవి ద్వారా రాయబారం నడిపి ఎలాగైతేనేం చివరకు పెళ్లి చేసుకొన్నాడు. కొల్లాపురంలో నుండిన లక్ష్మీదేవికి ఈ విషయం తెలిసి ఆమె తిరుపతి వెళ్లింది. తన స్థానంలో పద్మావతి ఉండడం చూసి, ఆమెతో లక్ష్మీదేవి తగవు పెట్టుకొంటుంది. "నా స్థానంలో ఉండడానికి నీకెంత సాహసం!" అంటూ పద్మావతిని తోసివేసి తన స్థానాన్ని తను ఆక్రమించుకొంది లక్ష్మీదేవి. అప్పుడు శ్రీనివాసుడుగా నున్న విష్ణుమూర్తి తన దక్షిణ భాగాన్ని పద్మావతిని చేర్చుకొన్నాడు. ఇది వేరే కథ.

ఈ తెలంగాణా ప్రాంతంలోని ప్రభువుల పాలనలో శాస్త్రీయ నర్తనమే కాక ప్రజానర్తనం బాగా పెంపొందింది. వీధి నాటకం, యక్షగానం, కోలాటం, దప్పులు మొదలైన ఇతర రకాల నాట్య రీతులను బుడసీలు, ఉగ్గు గొల్లలు, శారద వాండ్లు, పిచ్చుక గుంట్లు, పాండవులు, ఆరెమరాఠీలు, బోడిదాసరులు, సైంధవులు, భరతులు, బహురూపులు మొదలైన జాతుల వారెందరో ప్రదర్శిస్తూ వస్తు న్నారు. ముఖ్యంగా కరీంనగర్ జిల్లాలో ఈ నాట్యాలను ప్రదర్శించే కళాకారుల కుటుంబాల వారెందరో ఉండేవారు. పెద్దపల్లి, మంథెనలలో ప్రసిద్ధులైన నాట్య కళా కారు లెందరో ఉండేవారు. వివాహాది శుభ కార్యాలకు వీరినే తరచుగా ఆహ్వా నించి, వీరి ప్రదర్శనలను శ్రీమంతులు ఏర్పాటు చేసేవారు. వీరు మహారాష్ట్ర దేశంకూడా వెళ్ళి ప్రదర్శనలు ఇచ్చేవారు. ఈ కళాకారులకు లక్ష్మసాని, గిరా సాని, రామసాని మొదలైన పేర్లు ఉండేవి. ప్రజలు వీరిని గౌరవించేవారు.

యక్షగానాలను ప్రదర్శించే దాసరులు నేటికీ గట్టుపల్లిలో ఉన్నారు. వీరి ప్రదర్శన ప్రాచీన సంప్రదాయానుసారం ఉంటుంది. ఆటా, పాటే కాక వీరి ఆహార్యంగూడా ప్రాచీన పద్ధతిలోనే ఉంది. అయితే వీరు ఆర్థికంగా చాలా పేద వారు. అయినా వీరు ఈ కళను ఆరాధిస్తూనే ఉన్నారు. వీరిలాగే నిజామాబాదు

జిల్లాలో, చిందు మాదిగలు, బోడి దాసరులు, గసాడీ నర్తకలు మొదలైన వారు ఈ జానపద కళలో ప్రసిద్ధులు.

తెలంగాణాలోని జమిందారులు తమ దేవాలయాలలో నృత్య పూజను జరిపించేవారు. దేవనర్తకులను పోషించేవారు.

తెలంగాణా మొత్తంమీద యక్షగానాలను ప్రదర్శించే చిందు కళా కారులు ముప్పైవేలమంది వరకు ఉంటారు ఆంధ్ర ప్రదేశ్‌లో మరెక్కడా ఇంత పెద్ద సంఖ్యలో నృత్య కళాకారుల తెగ వేరొకటి లేదు.

భరతులు, బహురూపులు, సైంధవులు మొదలైనవారు గూడా యక్షగానాలను ప్రదర్శిస్తున్నారు.

జాయప తన నృత్త రత్నావళిలో భాండ్, గొండ్లి నృత్యాలగురించి ఉటంకించాడు. హాస్యరస ప్రధానమైన నర్తనం భాండ్ అయితే ఇది నేడు ప్రత్యేకంగా ఆంధ్రలో ఎక్కడా కనబడడంలేదు. కాని కాశ్మీర్ లోయలో నేటికీ దీనిని ప్రదర్శించే కళాకారులున్నారు సుమారు 700 సంవత్సరాల క్రితం జాయప వీరిని గురించి ప్రస్తావించాడు ఆ కాలంలో వీరు ఆంధ్ర దేశంలో ఉండేవారా ? లేక జాయప ఈ కాశ్మీర కళా రీతి గురించి పేర్కొన్నాడా ? అన్నది పరిశోధించ దగిన ప్రశ్న.

గొండ్లి అని వేరొక నర్తన రీతి గురించి వివిధ అభిప్రాయాలు వినవస్తున్నాయి. గొండ్లి అంటే కుండలి నర్తనం అన్నారు కొందరు, కుండపైని ఆడేది కుండలీ నర్తనం. మరి కొందరు దీనిని బృంద నర్తనంగా పేర్కొన్నారు. గుండ్రంగా వలయాలుగా తిరుగుతూ ఆడే నర్తనం అని మరి కొందరు అభిప్రాయపడ్డారు. అంబ భవానీని ఆరాధించేటప్పుడు గొండలిలు అనే తెగవారు దీనిని ప్రదర్శించే వారని మరి కొందరు అన్నారు జాయప దీనిని "ఛల్లాంగన" నర్తనంగా ప్రస్తావించాడు.

చంద్రపురి అంటే చాందా, బస్తరు, సిరువంచ మొదలైన ప్రదేశాలు, గోదావరీ తీరాన ఉన్నవి. కరీంనగర్ జిల్లాలో గోదావరినదిని దాటగానే రాజ గోండు సంస్థానాలు మనకు తగులుతాయి. వీటిని అనుకొనే 36 కోటల గోండు దేశ ముంది. ఇంకా ముందుకుపోతే జబల్‌పూర్ ప్రాంతంలోని మహారాణీ దుర్గావతి ఏలిన గోండు రాజ్య ముంది. ఈ రాజ్యం గోదావరీ, నర్మదా నదుల మధ్యనున్న అరణ్య ప్రదేశం. ఈ ప్రాంతీయుల సంస్కృతి ప్రత్యేకమయింది. వీరి సంగీత, నృత్యకళా రీతులు వేరుగా ఉంటాయి. జాయపకాలంలో కాకతీయ రాజులకు, ఈ గోండు రాజులకు రాచకీయ సాంస్కృతిక సంబంధాలు ఉంటి యుండవచ్చును. ఆ గోండు రాజుల ఆస్థానాలలోని భిల్లులు ప్రదర్శించిన నృత్యరీతే "గొండ్లి" అయుంటుంది. దీనిని జాయప చూసి, ప్రభావితుడై తన నృత్తరత్నావళిలో పేర్కొని ఉంటా డని నా అభిప్రాయం. ఈ యంశాన్నే కాక జాయప తన నృత్త రత్నావళిలో పేర్కొన్న వివిధ యితర నృత్యరీతుల గురించిగూడా మనం పరిశోధించవలసిన అవసరముంది. జాయప్ప పేర్కొన్న "పేరిణి" నృత్య తాండవ రీతిని నేను పరిశోధించి, పునః ప్రతిష్ట చేశాను.

సర్వవాద్య ఆరాధనా సమయాలలో మూడు, నాలుగు దశాబ్దుల క్రితం వరకు శుద్ధనర్తనాన్ని దేవనర్తకులు శివాలయాల్లో ప్రదర్శిస్తూ ఉండేవారు. "శివప్రియ", ఒక విశిష్ట నర్తనం, రామప్పదేవాలయంలోని ఒక స్థంభంపైని శిల్ప రూపంలో మనకు కనబడుతుంది. ఇలాంటి నర్తనాన్ని వీరముష్టివారు తెలంగాణాలో ప్రదర్శిస్తూ ఉంటారు.

దొమ్మరిసాని గెడపైకి ఎక్కి, గెడ చివరి సూది భాగంపైని తన బొడ్డును ఆన్చి, గిరగిరా తిరగడం కొల్లాటం నృత్యరీతికి చెందింది. దీన్నే మామూలుగా దొమ్మరి ఆట అంటారు. దీనికి మతపరమైన సంబంధ ముంది. ఆమె రెండు చేతుల్లోను వేప మండలను పట్టుకొని గెడపైని గిరగిరా తిరుగుతూ వాటిని నలు దిక్కులా విసురుతుంది. అవి ఎటువక్క పడితే అటువైపున్న భూములు చక్కగా పండుతాయని రైతుల నమ్మకం. అందువల్ల ప్రతి సంవత్సరం ఈ దొమ్మరివారిచేత ఈ కొల్లాటాన్ని ఆడించేవారు.

ఈ విధమైన దేశీయనర్తన రీతుల్ని గురించి, దేశి, కరణ రీతుల్ని గురించే గాక ఆస్థాన నర్తన రీతుల్ని గురించి కూడా జాయప్ప తన నృత్తరత్నావళిలో తెలియజేశాడు.

జాయప్ప తెలియజేసిన నర్తన రీతులకు నేటికాలంలో వరంగల్ జిల్లాలో నున్న నర్తన రీతులకు ఎలాంటి పొందికా కనబడదు. కాకతీయ మహారాజుల కాలంనాటి స్వయంభూ ఆలయం ధ్వంసం కావడంలో ఆనాటి నర్తన రీతులన్నీ భూమాత ఒడిలో మరుగుపడి పోయాయి. ఇంకా ఎక్కడైనా ఆ శాస్త్రీయ నృత్యాలు చెల్లాచెదరుగా ఉన్నాయేమో నేను చెప్పలేను. కాని నాకు తెలిసినంత వరకూ అవి లేవు.

సమ్మక్క, సారక్క జాతరలలోను, ఏడుపాయల ఎల్లమ్మ జాతరలోను, కొమరెల్లి మల్లన్న జాతరలోను, బీరప్ప పూజల్లోను ప్రదర్శింపబడే నర్తన రీతులన్నీ జానపద నృత్యాలే.

హైదరాబాదు నగర దేవిడీలలో కథక్ నర్తనాన్ని నవాబులు పోషించారు ఉత్తర హిందుస్తాన్‌నుండి వచ్చిన ఉస్తాదులు ఈ కథక్ నృత్యాన్ని చేసేవారు. ఈ ఉస్తాదుల్లో చివరివాడు ఖాజాబక్ష్. ఇతడు కడు వృద్ధుడుగా ఉన్నప్పుడు నేనొకసారి ఆయన్ని కలుసుకొని కథక్ నృత్యం గురించి ముచ్చటించాను. ఈయనతో దేవిడీ నృత్యకళ అంతరించింది. సంగీతనాటక అకాడమీ వారి ఆధ్వర్యంలో నేను నిర్వహించిన పేరిణీ శివతాండవాన్ని ఈ ఉస్తాదు చూసి, మెచ్చుకొన్నారు. ఈయనకు ఆఖరి దశలో అకాడమీ పింఛన్ యిప్పించాను.

దక్కన్ ప్రాంతానికి చెందిన పురావస్తువులను మనం పరిశోధిస్తే గోలుకొండ పాదుషాల, వారి అనంతరం వచ్చిన నైజాముల నృత్యకళా పోషణ గురించిన అనేక విశేషాలు మనకు లభించగలవు. గోలకొండ పాదుషాలు దక్కణీ నృత్యరీతులను, తెలుగు నర్తన రీతులను పోషించారని చెప్పవచ్చును.

హైదరాబాదు నగరానికి చేరువలో ఆల్వాల వేంకటేశ్వరస్వామి వారి ఆలయ ముంది దీనికి సర్ కిషన్ ప్రసాద్ వంశీయులు హక్కుదారులు. ఈ యాలయంలో నృత్యపూజ ఉండేది. ఈ యాలయ దేవనర్తకులలోని చివరి దేవనర్తకి శ్రీమతి వేంకటమ్మగూడ కొద్దికాలం క్రిందట మరణించింది. ఈ యాలయానికి చెందిన వృద్ధ యాజ్ఞికులు ఎవరైనా ఉంటే వారివద్ద ఆనాటి నర్తన రీతుల వివరాలు మనకు లభించవచ్చును.

గద్వాల సంస్థానంలో నరసరావుపేట జమీందారీ నుండి వచ్చిన నర్తకీ జనం కేళికలను చేసేవారు. గద్వాల సంస్థానంలో నాట్యకళ పూర్తిగా అంతరించి పోయినా నరసరావుపేటలో ఇంకా కొద్దిమంది వృద్ధ కళామూర్తులు ఉన్నారు. వీరిద్వారా గద్వాల సంస్థాన నాట్య రీతులను గురించి తెలిసికొనే అవకాశముంది.

ఖమ్మం జిల్లాలో ఎక్కువగా గిరిజన నర్తనాలు వృద్ధిపొందాయి.

హైదరాబాదు నాట్యకళా చరిత్రలో ప్రసిద్ధి గాంచిన వారు భాగామతి, తారామతి, ప్రేమామతి. ఈ ముచ్వురు నాట్యకళాకారులు ప్రదర్శించిన నాట్యకళా రీతులకు గురించి తెలుసుకోవాలంటే ఈ పాదుషాల కాలంనాటి కైఫియతులను పరిశోధించవలసి యుంటుంది.

పూర్వం తెలంగాణా ప్రాంతంలో అమీరులు, గరీబులు అనే రెండు తరగతుల వారే ఉండేవారు. మధ్యతరగతి వారు అతి అల్ప సంఖ్యాకులు. యక్షగానాలు, వీధి భాగవతాలు బీదవారికొరకు ప్రదర్శింపబడేవి. ధనవంతుల దేవిడీలలోను, దివాణాలలోను నృత్యకేళికలు ప్రదర్శింపబడేవి. ఈ నృత్యకేళికలు శాస్త్రీయమైనవిగా ఉండేవి. వీటిని చూచే అవకాశం సామాన్య ప్రజలకు సామాన్యంగా ఉండేది కాదు. ఎప్పుడైనా ఏదైనా ఆలయంలో జరిగే నృత్య కేళికలను ఏ యుత్సవ సందర్భంలోనైనా చూసే అవకాశం సామాన్యులకు కలిగేది. అందువల్ల శాస్త్రీయ నృత్యకళతో సామాన్యప్రజలకు పరిచయ ముండేది కాదు.

తెలంగాణా ప్రజలు బాలనాగమ్మ తందాన తాన కథను పూర్వం ఎంతగానో అభిమానించి, ఆదరించారు. ఈ తందానతాన కథను చెప్పడంలో పిచ్చుకకుంట్ల వారు ప్రసిద్ధులు. పాండురాజు కథను అంటే మహాభారత కథను పాండవులనే తెగవారు ప్రదర్శించేవారు. బీరప్ప కథలను ఉగ్గు గొల్లలు ప్రదర్శించేవారు. ఈ విధంగా ఒక్కొక్క తెగవారు ఒక్కొక్క కళా రూపాన్ని పంచుకొన్నట్టుగా సాధన చేసి ప్రదర్శిస్తూ ఉండేవారు.

చిరుతల రామాయణం అనే మరొక కళారూపం తెలంగాణాలో ప్రసిద్ధి గాంచింది. దీనినొక విశిష్టమైన నృత్య శైలిలో ఈ ప్రాంతవాసులు పెంపొందించారు. యక్షగానం ప్రజల కళగా తెలంగాణాలో బాగా అభివృద్ధి చెందింది. దీనిని ప్రజలే పోషిస్తూ వచ్చారు

"తెలంగాణాలో నృత్యం లేదు. శాస్త్రీయమైన నృత్యకళ అసలే లేదు" అని ముప్పై అయిదేళ్ల క్రిందట నేను కలిసిన పెద్దలు కొందరన్నారు. పరువానికి రాని పచ్చి కాయలవంటి పసి హృదయాలు చెప్పవలసిన ఈ మాటలను ఆ పెద్దల నోటంట విన్నాను. "ఆంధ్ర దేశంలో ఏముంది ? అంతా దక్షిణాదినే ఉంది !" అంటూ ఈ విద్వాంసులు, ఈ విజ్ఞానవేత్తలు వేదిక లెక్కి, ఉపన్యాసాలు ఇవ్వగా విన్నాను, విస్తుపోయాను. నిజమే అనుకొన్నాను. నేను ఆంధ్రలో అడుగు పెట్టిన తొలి దినాలవి.

"అయితే ఈ పెద్దలు పర్యటించి పరిశీలించిన దేశ మెంత ? వీరు చూసిన పట్నా లెన్ని ? వీరు సందర్శించిన దేవాలయా లెన్ని ?" అని ఒక్కసారి ఆలోచించాను. "ప్రాచీన బౌద్ధ స్థూపాలమీద, జైన మందిరాలమీద, పురాతన గుడిగోపురాల మీద స్త్రీ నర్తకుల నృత్యభంగిమ లుండగా ఆంధ్రదేశంలో నృత్యకళ లేకుండా పోతుందా ?" అని తర్కించుకొన్నాను.

"తమని తాము తెలిసికొనలేని వారు, తమ జాతి గొప్పతనాన్ని గుర్తించలేనివారు వీరు. ఇతరుల గొప్పతనాన్ని పొగడగలవారు వీరు" అని అనాడు

తెలుగుకళామతల్లి కంట నీరు కార్చి ఉండాలి, అని నేను తలిచి, పరిశోధనకు ఉపక్రమించాను. మూగవోయి యుండిన ఆంధ్రకళా సరస్వతి ఒక్కసారి వీణ మీటి, గళమెత్తి పాడి నాకు వినిపించింది. తన పాద మంజీరాలను ఘల్లున మోగించి నాయెదుట ఆంధ్రనాట్యకళాలక్ష్మి నాట్యమాడింది. రామప్ప దేవాలయం లోని నటరాజు తాండవాన్ని నాకనుల ముందు ప్రదర్శించాడు. ఈ విషయాన్ని నేను తెలుగువారికి తెలియజేశాను. స్త్రీల లాస్యనర్తనానికి, పురుషుల తాండవానికి గల భేదం తెలియని, ఏక పాత్ర కేళికకు, బహుపాత్రల వీధి భాగవతాలకు మధ్య గల భేదాన్ని గుర్తించలేని ఆనాటి పెద్దలు, విజ్ఞానవేత్తలు మళ్లా వేదికలు ఎక్కి ఆంధ్రుల కళలగురించి పొగుడుతూ మాట్లాడసాగేరు.

"కూచిపూడి, కుచేలపురి, కుశలవులపురి, ఆంధ్రులనాట్యం కూచిపూడి నృత్యం...." అని ఇంకా ఇంకా ఏమేమో మాట్లాడారు. ఆనాడు వారికి అసలు ఏమీ తెలియదు. ఈనాడు వారు తెలిసికొన్నది అంతంత మాత్రం. మీరైనా ఆంధ్రుల నృత్యకళా స్వరూపాన్ని సంపూర్ణంగా తెలుసుకొండి.

నాకు ఆంధ్రుల నాట్యకళగురించి తెలిసినంతవరకు అనేక నాట్యశాస్త్ర విషయాలను గ్రంథాలుగా రచించి తెలుగువారికి అందజేశాను.

కళా శిథిలాలుగా నిలిచియున్న పవిత్ర దేవాలయాలు కొన్ని మనకు ఈనాడూ కనబడుతూనే ఉన్నాయి. తెలుగుజాతి గొప్పతనాన్ని చాటడానికే అవి ఎండకు ఎండుతూ వానకు తడుస్తూ, దీన స్థితిలో అలా నిలిచియున్నాయేమో అని నాకు అనిపిస్తూ ఉంటుంది. మన యువకులు వీటిని పరిశోధిస్తే అవి వాటి పూర్వవైభవాన్ని తెలియజేయగలవు.

దేశంలో ఏదో ఒక నూతన మతం ఉద్భవిస్తూంటుంది. ప్రజల్లో ఒక నూతనోత్సాహం కలుగుతుంది. తమ జీవితాలకు శాంతి చేకూరగలదని ఆశిస్తారు, దానిని స్వీకరిస్తారు. పాలకులు దానిని ఆదరిస్తే దానితోపాటు కళలు మూడు పువ్వులు ఆరుకాయలుగా వికసించేవి. పాలకుల మతంలో మార్పురావడంతో

అంతవరకు విశిష్టతతో వికసించిన ఆ కళలు ఆ పాలకుల చేతిలో నాశనమై పోతాయి. అప్పటివరకు యుండిన కళావైశిష్ట్యాన్ని మించిన దానిని సాధించాలన్న కోరికే ఈ నాశనానికి కారణం. సుమారు రెండువేల సంవత్సరాలనుండి ఇదే విధంగా ప్రపంచమంతటా జరుగుతూ వస్తున్నది. ఎక్కువగా భారతదేశంలో, ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్‌లో జరిగింది.

ఆంధ్రులు ఆవేశపరులు. ఆవేశంవల్ల ఆంధ్రులకు ఏచపుడా జ్ఞానం నశిస్తూ ఉంటుంది. ఏదో చేయబోయి ఏదోచేస్తారు. తర్వాత విచారిస్తారు. ఇదే మొదటి నుండీ ఆంధ్రులకు సంక్రమిస్తూ వచ్చిన దుర్బలత్వం.

పాలంపేట రామప్ప దేవాలయ శిల్పాన్ని పరిశోధించడానికి నేను అనేక సార్లు వెళ్లాను. దానికి చేరువలోనే ఘనాపురం ఉంది. అక్కడ దొక ఆలయ ముందని విని, చూడ్డానికి ఒకసారి వెళ్లాను. ఆ యూరికి మొదట్లోనే ఒక శిథిల మందిర ముంది. దానిచుట్టూ దట్టంగా ముళ్లపొదలు, చెట్లూ మొలిచి యున్నాయి. వాటిని ఎలాగైనా తప్పించుకొని ఆ యాలయం వద్దకు వెళ్లాలనుకొన్నాను, కాని ఒక నాటి ఆ పవిత్ర దేవాలయం నేడు ఆ గ్రామవాసుల మరుగుదొడ్డిగా మారి పోయింది. కాలుపెట్టడానికి కూడా వీలులేకుండా ఆ గుడి అపరణ తయారయింది. ఆ కుళ్లు కంపును నేను భరించలేక నేను తిరుగుముఖం పట్టాను కాని ఆ గుడిలోని సుందర శిల్పాలకు భరించక తప్పదు గదా !

అక్కడినుండి తిన్నగా ఆ వూరిలోని కోటగుళ్లు చూడ్డానికి వెళ్లాను. అదొక పెద్ద ఆలయం, శిల్పాలకు నిలయం. కాని దాని పైకప్పు పడిపోయింది. ఆ యాలయం ఏ క్షణాన్నైనా కూలిపోయేటట్లు ఉంది. అందులో ఏమీ మిగిలిలేదు గాని నా హృదయంలో బాధ మిగిలింది.

పిల్లలమర్రిలో రాణి ఎరుకసానమ్మ కట్టించిన ఎరుకేశ్వరుని ఆలయ ముందని ఒకసారి చూడడానికి వెళ్లాను. అక్కడకూడా అంతా శిథిలావస్థలో ఉంది. కొంతమంది మతపిచ్చిగాళ్లకు ఇదేమి రోగమో ! మతాన్ని వారు

ప్రచారం చేసికోక అన్యమతస్తుల దేవాలయాలను నాశనం చేస్తారు. ఎవరి మతాన్ని వారు ప్రచారం చేసికోవచ్చును. అన్యమతస్తుల హృదయాలను మార్చి వారిని తమ మతంలో చేర్చుకోవచ్చును. కాని ఆలయాలను ధ్వంసం చేసినందువల్ల ఆ మతంయెడల ఇతరులకు ఏహ్యాభావం కలుగుతుందే తప్ప మత ప్రచారం జరగదు. ఈ యాలయాలను ధ్వంసం చేయడానికి వారికి చేతు లెలా వచ్చాయో నాకు అర్థం కాదు.

ఆలేరుకు చేరువలో కొలనుపాక అనే ఊరుంది. అక్కడ అపూర్వ శిల్ప సంపదగల సోమేశ్వరాలయ ముంది. ఆ యాలయ శిల్పాలన్నీ శిథిలమై ఉన్నాయి. ఆ శిథిల శిల్పాలలో చక్కని నృత్య భంగిమ లున్నాయి. కాని చాలా మందికి ఆ శిల్పాల గురించే కాదు అక్కడ ఈ యాలయ ముందన్న సంగతే తెలియదు. నేడు ఆ సోమదేవుడు మరుగున పడిపోయాడు. ఆయన వైభవం నేడు మనకు కనబడదు.

అక్కడున్న జైన మందిరం గురించి మాత్రం అందరికీ తెలుసు. ఆంధ్ర దేశంలోని ప్రాచీన జైన మందిరాల్లో మగిలియున్నది అదొక్కటే. ఆ యాలయ ప్రాంగణంలో మహత్తరమైన శైవ శిల్పా లున్నాయి. ఇవన్నీ మన ప్రాచీన నర్తన విశేషాలను తెలియజేస్తాయి. యువక నృత్య కళారాధకులారా ! ఒక్కసారి ఈ శిల్పాలను సందర్శించండి !

నల్లగొండ పట్నానికి దగ్గర్లోనే పానగల్లులో పచ్చల సోమేశ్వరునీ, ఛాయల సోమేశ్వరుని ఆలయా లున్నాయి. సూర్యోదయంనుండి, సూర్యాస్తమయం వరకు ఒక సన్నని సూర్యకిరణం ఆలయ గోపురంలో నుండి వచ్చి ఛాయల సోమేశ్వరునిపైని ప్రసరించి ఆరాధిస్తూ ఉంటుంది. దేవాలయ నిర్మాణంలో ఇదొక అద్భుతం.

బాలనాగమ్మ కథను పిచ్చుకగుంట్ల వారు పాడగా విని, కంటతడి పెట్టని వారు ఆంధ్రలో ఎవరూ ఉండరు. బాలనాగమ్మ ఒక త్రిలోకసుందరి. ఆ

మహారాణి సౌందర్యం గురించి విన్న మాయల ఫకీరు (మాయల మరాఠి) ఆ మహారాజు కోటలో లేనప్పుడు మారువేషంలో వచ్చి ఆమెను చెరబట్టేడు. రాముడు లేనప్పుడు రావణాసురుడు సీతను చెరబట్టినట్టు.

ఆ మహారాణీ బాలనాగమ్మ నివసించిన కోట పానగల్లులోనే ఉండే దంటారు. స్వర్గీయ సూరవరపు ప్రతాపరెడ్డిగారి ఆంధ్రుల సాంఘిక చరితలో ఈ విషయం చదివినట్టు గుర్తు. బాలనాగమ్మ కథలో ఆ మాయల మరాఠీ నిర్మించిన అతని కోట, ఆ కోట యుండినచోటు. అతడు నడిచిన బాట వివరంగా ఆ కథలో ఎవరో పూర్వకవి వ్రాశాడు. ఈ ముచ్చట ఎప్పుడు, ఎక్కడ జరిగిందో, ఈ వడ్డెరాజు లెవరో, ఆనాటి రాజకీయ, సాంఘిక పరిస్థితులు ఎలా ఉండేవో మొదలైన విషయాలన్నీ ఈ తందానతానపాటలో ఉన్నాయి. శత్రువులకు దుర్భేద్యమైన ఆ కోట యొక్క శిథిలాలు ఏమైనా ఇంకా మిగిలి యున్నాయా ? ఇవన్నీ ఆసక్తి దాయకమైన విషయాలు, నిజంగా పరిశోధించ దగ్గవి.

పల్నాటి యుద్ధం, బొబ్బిలి యుద్ధం మహాభారతాన్ని జ్ఞప్తికి తెస్తే బాలనాగమ్మ కథ రామాయణాన్ని గుర్తుకు తెస్తుంది. బాలనాగమ్మను ఆ మాయల మరాఠీ ఎత్తుకొనిపోయి బంధిస్తే ఆమె కొడుకు ఆమెను చెరనుండి విడిపించి తీసికొని వస్తాడు. బొబ్బిలి యుద్ధం, పల్నాటి యుద్ధం నిజంగా జరిగాయని మనకు తెలుసు. బాలనాగమ్మ కథగూడా నిజంగా జరిగే ఉండాలి. ఎవరైనా పరిశోధిస్తే ఈ కథలోని నిజానిజాలు తెలిసి వస్తాయి.

నా పరిశోధనా పర్యటనలో నేనొక ఊరు వెళ్లాను. అక్కడొక శిథిల శివాలయ ముంది. అదొక గొప్ప ఆలయంగాను, పూర్వం చెప్పుకొనే వారు. మధ్యాహ్నం సూర్యుడు నడి నెత్తిని ఉన్నప్పుడు ఆ శివలింగంపైని పత్తిని పెడితే భగ్గున మండి భస్మమయ్యేదిట ! ఆ మహత్తును చూడడానికి, నేడు పక్షి తీర్థంలోని పక్షుల్ని చూడ్డానికి వెళ్లినట్టు వేలాది మంది జనం వెళ్లేవారట.

తమ సామర్థ్యాన్ని, సృజనాత్మక శక్తిని నిరూపించు కొనడానికి ఆ శిల్పులను, ఆ శిల్పాల మధ్యను ఒక భూతద్దాన్ని అమర్చి ఆ గర్భగుడిని

నిర్మించారు శిల్పులు. ఆ భూతద్దంలోనుంచి సూర్యకిరణం పడి పత్తి కాలిపోయేది. ఆ భగవంతుని మహత్తువల్ల అ పత్తి కాలిపోయినట్టు ఆ గుడి పూజారులు అమాయక ప్రజలను నమ్మించేవారు మోసగించేవారు. ఈ మర్మమెరిగిని కొందరు అన్యమతస్తులు గోపురమెక్కి ఆ శిల్పాలలోని ఆ భూతద్దాన్ని తొలగించారు. పరమతస్తుడు ఆలయంలో ప్రవేశించినందువల్ల దేవుడు మైలపడి తన మహత్తును చూపించడం లేదన్నారు ఆ గుడి పూజారులు. నిజమే నను కొన్నారు ఆ యమాయక ప్రజలు. దేవునికి శుద్ధి జరగలేదు గనుక ఆ దేవుడు మహిమ లేని వాడైనాడు. మహిమలేని దేవుణ్ణి ప్రజలు దర్శించుకొనడం మానివేశారు. ఆ యాలయం మూతపడిపోయింది. రాను రాను శిథిలమైంది.

వేరొక దేవాలయంలో దేవుడు గర్భగుడిలో ఏ యాధారం లేకుండా గాలిలో నిలబడి ఉండేవాడు. ఆ దేవుడు మహత్తు గలవాడు గనుక అలా నిలబడి ఉన్నాడని ఆ యాలయ పూజారులు అమాయక ప్రజలను తమ స్వార్థం కొరకు నమ్మిస్తూ వచ్చారు. ప్రజలు ఆశ్చర్యపోయి, విస్తుపోయి ఆ దేవుణ్ణి ఆరాధించే వారు. కొంతమంది నాస్తికులు కూడా ఆ వింతను చూడడానికి వెళ్లేవారు. ఎప్పుడూ జనంతో ఆ యాలయనిండి ఉండేది. ఆలయ అధికారులు డబ్బు చేసికొని గొప్ప వారయ్యేరు. దీనితో కొందరు అసూయాపరులు బయలు దేరారు. ఆలయ అధికారులపైని ఎలా దెబ్బతీయాలని ఆలోచించారు. దేవుడు గాలిలో ఏ యాధారం లేకుండా ఎలా నిలబడి ఉన్నాడన్న విషయాన్ని వీరు గ్రహించారు. ఒక రాత్రి పూట ఆలయంలో ఎవరూ లేకుండా చూసి, ఆ దేవుని విగ్రహానికి ఆధారంగా ఉన్న సూదంటు రాళ్లను తొలగించారు. ఆ దేవుడు నేల కూలాడు. ఆయన మహిమ మాయమయింది. భక్తులు మరి రావడం మానివేశారు. ఆలయం మూతపడింది. గబ్బిలాలకు ఆ గుడి నివాసమైంది. తుదకు శిథిలమై భూమాత ఒడిలో వరిగిపోయింది. ఆ ఉభయ వర్గాలవారు ఆ దేవుని డబ్బు వాటాలు వేసుకొని యుంటే కనీసం ఆ యాలయమైనా శాశ్వతంగా నిలిచియుండేది.

ఇలాంటి ముచ్చట్లు ఎన్నో తెలంగాణా చరిత్రలో ఉన్నాయి. ఇలా వ్రాస్తూ పోతే ఇదే ఒక పెద్ద గ్రంథమౌతుంది.

ఆంధ్రప్రదేశ్‌లోని మూడు ప్రాంతాలలోను నృత్యకళ వివిధ రీతుల్లో విశిష్టంగా పెంపొందింది.

తెలంగాణా ప్రాంతంలో యక్షగానం, సాగరసీమలో భాగవతం, రాయల సీమలో వీధినాటకం ప్రసిద్ధిగాంచాయి. ప్రజా కళలుగా ఈ మూడు విశిష్ట స్థాయిని పొందాయి. ఈ మూడు కళలకు చెందిన ఈ మూడు ప్రాంతాల కళాకారులు సమావేశమై వీటి మూల సూత్రాలను చర్చించి, ఒకరి కళను వేరొకరు అర్థం చేసుకొంటే ఈ కళలు ఇంకా అభివృద్ధి చెందడానికి అవకాశ ముంది.

ఆ ప్రయత్నం నేను నృత్య అకాడమీ అధ్యక్షునిగా నున్నప్పుడు చేశాను. మన ప్రాచీన కళలకు చాలా మేలు జరిగింది. ఇంకా చేయవలసింది ఎంతో వుంది.

# ఆంధ్రుల నృత్యకళ - తంజావూరు

ఆంధ్రుల నృత్యకళా చరిత్రను పూర్తిగా పరిశోధించ దలచుకొన్న వారు ప్రత్యేకంగా తంజావూరు వెళ్ళి, అక్కడ కొన్నాళ్లుండి, అక్కడి కోటను, దాని లోని సంగీత సాహిత్య సభా మందిరాలను, గ్రంథాలయాన్ని, ఇంకా ఇతర స్థలాలను పరిశీలించి, పరిశోధించవలసి యుంటుంది. తంజావూరు మధుర క్షేత్రాలలోని ఆలయాలను, వాటిలోని శిల్పకళా సంపదను, ప్రత్యేకంగా పరిశీలించ వలసి యుంటుంది. అంతేకాదు, తంజావూరు నాయక రాజులు దక్షిణాదిని నిర్మించిన ఆలయాలను, వాటి కళా సంపదను, వాటిని వారు పోషించిన తీరును గూడ పరిశీలించవలసి యుంటుంది. అప్పుడు పరిశోధకులు ఆంధ్రుల నృత్యకళా వికాస, విశిష్టతలను పూర్తిగా అవగాహన చేసికొన గలుగుతారు. పూర్తిగా పరిశోధించ గలుగుతారు.

## తంజావూరు నాట్యం

ఆంధ్రులు దక్షిణా పథంలో నెలకొల్పిన మహా సామ్రాజ్యం, కాకతీయ సామ్రాజ్యం పతనమైన తర్వాత విజయనగర మహా సామ్రాజ్యం స్థాపించబడింది.

కాకతీయులు శైవులు, విజయనగరం వారు వైష్ణవులు, ఈ యుభయుల పరిపాలనలో శైవ, వైష్ణవ సాంప్రదాయక నర్తన రీతులు విశేషంగా పోషింప బడ్డాయి. అవి బాగా అభివృద్ధి చెందాయి. శైవ సంప్రదాయంలో నృత్త, నృత్యాలు సంపూర్ణంగా విరాజిల్లితే, వైష్ణవ సంప్రదాయంలో అభినయం అభివృద్ధి పొందింది. విజయనగరాధీశులు తెలుగు సాంప్రదాయక కళారీతులను తంజావూరు, మధుర ప్రాంతాలలో పోషించారు.

పాండ్య రాజులు పరిపాలించిన ప్రాచీన రాజ్యం మధుర. తంజావూరును చోళ రాజులు ఏలారు. పాండ్య చోళ రాజులు తమిళ ప్రభువులు. కనుక వీరు

తమిళ సాంప్రదాయక కళలను పోషించారు. "శిల్పాదికారం" మొదలైన గ్రంథాలలో ఈ కళల గురించి విపులంగా ఉంది. నేను రచించిన "దాక్షిణాత్యుల నాట్యకళా చరిత్ర"లోను, ఇంకా యితర గ్రంథాలలోను నేను వీటిని గురించి క్లుప్తంగా తెలియజేశాను.

మీనాక్షి అమ్మవారు, సుందరేశుడు వెలిసిన పుణ్యక్షేత్రం మధుర, బృహదీశ్వర స్వామి, బృహన్నాయికి వెలిసిన పుణ్యక్షేత్రం తంజావూరు. ఈ యధ్యాయంలో పై రెండు క్షేత్రాలలో తెలుగు రాజుల కాలంలో పెంపొందిన కళారీతుల గురించి తెలియజేస్తున్నాను. ముఖ్యంగా తంజావూరు కళల వికాసం గురించి తెలుసుకొనక పోతే ఆంధ్రుల నృత్యకళా చరిత్రను పూర్తిగా తెలుసుకొన డానికి వీలుండదు.

తంజావూరు, మధుర, తిరిచినాపల్లి, శ్రీరంగం. కుంభకోణం, రామేశ్వరం, చిదంబరం, కంచి మొదలైన అనేక దక్షిణాది పుణ్యక్షేత్రాలలోని ఆలయాలలోగల దివ్య సుందర నృత్యశిల్పాలు ఇంతవరకు మనం తెలుసుకొనని అనేక ఆసక్తికరమైన విషయాలను తెలియజేయగలవు.

తిరుమలమ్మ అచ్యుతరాయుని భార్య. ఆమె చెల్లెలు మూర్తమ్మను చెవ్వప్ప చేపట్టేడు. అందువల్ల అచ్యుతరాయలు తంజావూరును స్త్రీ ధనంగా ఆమె కిచ్చాడు. ఇందువల్ల తంజావూరు చెవ్వప్ప పాలన క్రిందకు వచ్చింది. దీంతో తెలుగు రాజుల పాలన దక్షిణాదిని ప్రారంభమైంది.

ఇలాగే విశ్వనాథనాయకుని తండ్రి నాగమనాయకునిద్వారా మధురలో తెలుగు రాజుల పాలన ప్రారంభమయింది. వీరివురూగూడ విజయనగర సామ్రాజ్యాధిపతులకు సామంతులు. చెవ్వప్ప, అచ్యుతప్ప, రఘునాథనాయకుడు, విజయరాఘవ నాయకుడు తంజావూరును వైభవోపేతంగా పరిపాలించారు. మధురను పాలించినవారిలో నాగమనాయకుడు, విశ్వనాథనాయకుడు రాజా చొక్కనాథనాయకుడు ప్రసిద్ధులు.

తంజావూరులో వెలిసిన నృత్యసంగీతాది కళలను గురించి ఎందరో పరిశోధించారు, కాని మధురలో పెంపొందిన నృత్యసంగీత కళల గురించి ఎవరూ అంతగా పరిశోధించలేదు. ఇక్కడి కళలగురించి పరిశోధకులకు ఆసక్తి ఎందుకు కలగలేదో !

తంజావూరు, మధుర రాజుల మధ్య చెలరేగిన కుటుంబ తగాదాల వల్లనే తంజావూరు నాశనమైంది. తెలుగు సంస్కృతి అక్కడ చాలావరకు నశించిందనే చెప్పవలసి యుంటుంది. నాయక రాజుల అనంతరం తంజావూరును ఏలిన మహారాష్ట్రరాజులు, ఏకోజీ, శివోజీ, ఖండోజీ, తులజాజి, శరభోజి, శహాజీ, ప్రతాపసింహ మొదలగు మహారాజులు వారి మాతృభాషయిన మహారాష్ట్రంతో బాటు తెలుగు భాషను గూడ అభ్యసించి, తెలుగులో కవితలల్లి, తెలుగు భాషను పోషించారు. నాయక రాజుల కాలం నాటి తెలుగు సంస్కృతి విజయరాఘవ నాయకుని రాజ్యకాలానంతరం చాలావరకు నశించినా ఈ మహారాష్ట్రి రాజుల కాలంలో వేరొక విధంగా పెంపొందింది.

తంజావూరు విజయరాఘవ నాయకుని కుమార్తెను తన కిచ్చి, వివాహం చేయమని మధుర రాజా చొక్కనాయకుడు కోరుతూ విజయరాఘవునికి లేఖ వ్రాశాడు. ఈ చొక్కనాథుని తాత అంతకు పూర్వం తిరుమలనాయకునికి తంజావూరు రాజకన్య అచ్యుత రఘునాథమ్మను ఇచ్చి వైభవంగా పెళ్లిచేశాడు. మధురలో అతడు క్రొత్తగా నిర్మించిన తిరుమల నాయక మహలును ఆమెకు అతడు చూపించగా తన తండ్రిగారి మహలుకు అది సరితూగదని ఆమె హేళన చేసిందట. దాంతో అతనికి కోపంవచ్చి, వెంటనే ఆమెను తన కరవాలంతో పొడచి, చంపివేశాడట ! ఆనాటి నుండి ఈ యిరు రాజవంశీయుల మధ్య వైరం వచ్చింది. ఈ విషయం మరచిపోని విజయరాఘవుడు ఈ క్రొత్త వియ్యానికి సమ్మతించలేదు. దీంతో ఈ రెండు రాజ్యాల మధ్య యుద్ధం చెలరేగింది. విజయరాఘవుడు అప్పుడు కడు వృద్ధుడై యుండినందున తంజావూరు నాశనమైంది. నాయకరాజుల అనంతరం తంజావూరులో మహారాష్ట్రి రాజుల పాలన ప్రారంభమైంది. వీరిలో ఏకోజీ ప్రథముడు. ఈ రాజవరేణ్యులు నిర్మించిన దేవళాలను,

వాటిలోని శిల్ప సంపదను పరిశోధిస్తే దక్షిణాదిని వెలిసిన ఆంధ్రుల నృత్యకళ గురించి ఇంకా అనేకమైన ఆసక్తికర విషయాలు బయల్పడవచ్చు.

ఆంధ్రదేశంలో అనేక రాజ్యాలు వెలిశాయి కాని ఏమి పాపమో ఆ రాజ్య వైభవాలు ఆ రాజులతోనే అంతరించి పోయాయి. శాతవాహనుల కాలం నుండి గూడ అమరావతి (ధాన్యకటకం), కొండాపురం, నాగార్జున కొండ వద్ద విజయపురి, వేంగి, ప్రతిపాలపురం, ఓరుగల్లు, విజయనగర ప్రభువుల హంపీ, రాచకొండ ప్రభువుల దుర్గం, కొండవీడు, కొండపల్లి, పాదుషాల గోలకొండ, చంద్రగిరి, పెనుగొండ, గుత్తి మొదలైన కోటలు, మహళ్లు, నగరాలెన్నో ఒకప్పుడు మహా వైభవాన్ని అనుభవించి శత్రురాజుల చేతుల్లో ధ్వంసమైనాయి. అగ్నిదేవునికి ఆహుతి అయినాయి. కాలక్రమేణా వాటి శిథిలాలు భూమిలో కూరుకుపోయినాయి. కాని మధుర, తంజావూరు, నగరాలు నేటికీ పోయినవి పోగా ఇంకా చాలవరకు బాగున్నాయి, శిల్పసంపద, చారిత్రక గ్రంథాలు మిగిలియున్నాయి ఆ రాజ వంశీయులు అక్కడ ఇప్పటికీ కనిపిస్తూ ఉంటారు. అందువల్ల ఆంధ్రుల కళా చరిత్ర తెలుసుకోవాలంటే తంజావూరు మధురలోని పుస్తక భాండాగారాలలో మిగిలియున్న గ్రంథాల నన్నిటిని, ఆలయ శిల్పాలన్నింటిని, పరిశీలించి, పరిశోధించవలసి యుంటుంది. సంపూర్ణంగా కాకపోయినా చాలా వరకైనా ఆంధ్రుల నృత్యకళా వైభవాన్ని తెలుసుకొనడానికి వీలు కలుగుతుంది.

నన్నయ, తిక్కన, విద్యానాథుడు, పోతన్న, పెద్దన్న, శ్రీనాథుడు మొదలైన మహాకవులు వారి కాలంనాటి కళా విషయాలను వారి గ్రంథాలలో కావ్యాలలో ఉటంకించారు. వీటికి మనం ప్రభావితులమౌతాము కాని తీరా ఆ యా ప్రదేశాలకు వెళ్లి ఆ పేటలు, కోటలు వాటిలో వెలసిన కళా సంపదను వీక్షించాలని వెతికితే మనకు లభ్యమయ్యేది విషాదమే. ఆలయాలున్నా ఇంకేమి మనకు కనబడదు. కొన్ని భూమిలో కూరుకొని పోయాయి. కొన్ని మట్టి దిబ్బలైనాయి. కొన్ని శిథిల శిల్పాలు గుట్టలుగా పడియున్నాయి. కొన్ని ఇటుకరాళ్లుగా మారిపోయాయి. ఒకనాడు వైభవంగా వెలిసిన వీటిని చూసి మనం కన్నీరు కార్చవలసి యుంటుంది. ఈ దుస్థితిని పరిశోధకులు ఎదుర్కొనవలసి యుంటుంది.

తంజావూరు, మధురల విషయంలో ఇంత ఘోరం జరగలేదు. అక్కడి ప్రాచీన వైభవం కొంతపోయినా కొంత మిగిలియుంది. మన ప్రాచీన సంస్కృతిని చాలావరకు తెలుసుకొనడానికి వీలైనవిగా అక్కడి దైవ మందిరాలు, రాజ మందిరాలు మిగిలి యున్నాయి. మధురలోని మహల్ను చూచినప్పుడు నా హృదయం బాధతో విల విల లాడిపోయింది. ఆ మహారాణి తొందరపడి మాటలు జారకుండా యుండి యుంటే తంజావూరు పతనమయ్యేది కాదు. విలువైన మన సాంస్కృతిక చిహ్నాలు నాశనమయ్యేవి కావు అనిపించింది. పొరపాటున నోరు జారిన మాటలో ఎంతటి వినాశకరమైన శక్తి ఉందో ఈ మధురానగర చరిత్ర వల్ల విదితమౌతుంది.

ప్రపంచంలోని ఏ దేశ చరిత్ర చూసినా కాంతా, కనకలావల్లనే యుద్ధాలు సంభవించి, మహాసామ్రాజ్యాలు పతనమైనట్లు కనబడుతుంది.

ఎంతో సంస్కారవంతుడు, సంగీతజ్ఞుడు, మహాబలశాలి, మహా శివభక్తుడూ అయిన రావణబ్రహ్మ సీతమ్మను చెరబట్టి బట్టే అతని రాజ్యం నాశనమైంది. రావణుడు మహాశివభక్తుడైనా, మాతృభక్తి పరాయణుడే అయినా, రాజతంత్ర నిపుణుడే అయినా అమాయకురాలు, నిస్సహాయురాలు పరకాంత అయిన సీతమ్మను చెరబట్టడం వల్లనే తన రాజ్యాన్ని పోగొట్టుకొనడమే కాక ప్రాణాలను గూడా పోగొట్టుకొని రాక్షసుడుగా పరిగణింపబడ్డాడు

ద్రౌపదిని నిండు సభలో అగౌరవపరచడం వల్లనే మహాభారత యుద్ధం సంభవించింది కోట్లాది మంది ప్రజలు చనిపోయారు పౌరుషవంతులు, శౌర్యవంతులు, యుద్ధతంత్ర నిపుణులు ఆ యుద్ధంలో అసువులను బాశారు. భారత జాతి శక్తిహీనమైంది. అందువల్లనే విదేశీయులు మన భారత దేశాన్ని వశపరచుకొన గలిగారు కొన్నాళ్లపాటు మన భారతదేశం బానిస దేశమయింది.

ట్రాయి దేశపు రాజవనిత హెలెన్ వల్ల ఎంత రక్తపాతం జరిగిందో ప్రాచీన గ్రీకు దేశ చరిత్ర చదివితే తెలుస్తుంది. మనం రాజస్థాన్ కథలు, చరిత్ర చదివితే ఇటువంటివి ఎన్నో వాటిలో ఉంటాయి.

త్రిలోక సుందరి కృష్ణకుమారి ఒక సామంత రాజు కుమార్తె. రెండు దేశాలకు చెందిన ఇరువురు రాకుమారులు ఆమెను పెళ్లిజేసికొన దలచి ఆమె తండ్రికి తమ కోర్కెను తెలియజేశారు. తమ కోర్కెను తీర్చకపోతే ఆ సామంత రాజ్యాన్ని నాశనం చేస్తామని ఆయనను హెచ్చరించారు. ఫలసంతంగా ఆమెను పొందాలని చూసిన ఈ రాకుమారులు ఎంతటి మూర్ఖులో, వారి హృదయం ఎంత పాషాణమైనదో ఆ సృష్టికర్తకే తెలియాలి. వీరి కోర్కెవల్ల ఆ సామంత రాజ్యంలోని ప్రజలు ఎందుకు హింసింపబడాలి? ఆ సామంత రాజ్యం ఎందుకు నాశనం కావాలి? రక్తపుటేరులు ఎందుకు ప్రవహించాలి? ఆ సామంత రాజ్యం మానవ రక్తంతో ఎందుకు అభిషేకించబడాలి? అన్న విషయాలను వారెప్పుడూ ఆలోచించి యుండరు. ఆలోచించి యుంటే మరిద్దరు అశోకులు భారత చరిత్రలో ఉండి యుండేవారు. ప్రపంచంలో ప్రేమవాహినులు ప్రవహించి యుండేవి. త్యాగమూర్తి ఆ రాచకన్య విషం త్రాగి ఆత్మహత్య చేసుకొంది. ఇలాంటి వింత ఘట్టమే తంజావూరు రాజ్యపతనానికి కారణ మయింది.

రామాయణంలో విభీషణుడు, మహాభారతంలో శల్యుడు విరోధ పాత్ర వహించినట్టే ఒక్కొక్క రాజ్యకాలంలో ఒక్కొక్కడు ఇటువంటి పాత్రను ధరిస్తూవచ్చాడు. దక్కను పీఠభూమిలో ఒక విశిష్ట సంస్కృతిని నెలకొల్పిన గోల్కొండ పాదుషా ఓడిపోవడానికి అతడు నమ్మిన బంటు చేసిన ద్రోహమే కారణం. తంజావూరు విషయంలో గూడ ఇలాంటిదే జరిగింది.

మధుర రాజులు, తంజావూరుపైని దండెత్తిన నాటికి విజయరాఘవుడు ఎనభై సంవత్సరాల పండు ముదుసలి. తన కుటుంబానికి, తన వంశానికి జరిగిన అగౌరవంవల్ల అతని హృదయం కలత చెంది తన కుమార్తెను మధుర రాజుకు ఇచ్చి పెళ్లిచేయడానికి ఇచ్చగించలేదు. దీంతో మధుర పాలకుడు తంజావూరు పైని దండెత్తాడు. విజయరాఘవుడు అతని కుమారులు ఆ యుద్ధంలో మడిశారు. రాణివాసం వారు అగ్నిదేవునికి ఆహుతి అయ్యారు. ఆయన కొలువులోని పండితులు, కవులు, కవయిత్రులు, గాయనీ గాయకులు, నర్తక నర్తకీమణులు, విద్వాంసులు మొదలైన వారిలో ఉత్తము లందరూ అగ్నిలో పడి ప్రాణత్యాగం

చేశారు. ఎంతటి కళా వికాసం, ఎంత గొప్ప సంస్కృతి మంట గలిశాయో తంజావూరులోని ప్రతి రాయీ, రప్పా మనకు తెలియజేయగలవు. అయితే అక్కడి సంస్కృతీ వైభవాన్ని కొంతవరకైనా పునరుజ్జీవింప జేసినవారు మహ దాష్ట్రి రాజులు, ఎకోజీ, శివోజీ, తులజాజీ, శరభోజీ, శహజీ, అమరసింహ, ప్రతాపసింహులు. వీరి మాతృభాష మరాఠీయే అయినా తెలుగు భాషను క్షుణ్ణంగా అభ్యసించి తెలుగులో కావ్యాలు, యక్షగానాలు, పాటలు, పదాలు రచించి తెలుగు సంగీత, నృత్య బాణిలను పెంపొందించి, పోషించారు. నేడు "భరతనాట్యం" అన్న పేరుతో ప్రపంచ ప్రఖ్యాతి పొందిన తెలుగు "కచ్చేరి లేక కర్నాటక" బాణీ వీరి కాలంలోనే రూ పొం దిం ది. దీనిని అప్పుడు "తంజావూరు నాట్యం" అనేవారు. దీనినే తమిళ సోదరులు "సాదిర్" అన్నారు. ఆలయాలలో ప్రదర్శించిన నాట్యాన్ని "చిన్నమేళం" అన్నారు.

బొబ్బిలి, విజయనగరం, మాడుగులు, తుని, పెద్దాపురం, పిఠాపురం, కపిలేశ్వరపురం, శనివారపుపేట, నూజివీడు, ముక్త్యాల, చల్లపల్లి, వేంకటగిరి, కాళహస్తి, కార్వేటినగరం మొదలైన ఆంధ్రదేశంలోని జమీందారీలలోని పెద్దలను దర్శించి, అక్కడ ప్రచారంలో ఉండిన నృత్య కళారూపాల గురించి తెలుసుకొన్నాను. కొలనుపాక, పాలంపేట వంటి ప్రాచీన ప్రదేశాలలోని కళావైభవాన్ని గూర్చి తెలియజేయగలవారు నాకు తటస్థపడలేదు. అక్కడ మిగిలియున్న శిల్ప కళా శిథిలాలనే సంప్రదించి కొంతవరకు తెలుసుకొన్నాను. నేను తెలుసుకొన్న దంతా అక్షర రూపంలో పెట్టాను. తెలుసుకోవలసింది ఇంకా ఎంతో ఉండే ఉంటుంది. దానిని తెలుసుకోవాలని ఎవరైనా పరిశోధించ దలచితే వారొక్క సారైనా తంజావూరు వెళ్లి, అక్కడ మిగిలియున్న వాటిని కనులారా దర్శించి, పరిశోధించవలసి యుంటుంది. అప్పుడుగాని వారి పరిశోధన సంపూర్ణం కాదు.

గోదావరి తీరాన ఉద్భవించి, కృష్ణా, తుంగభద్రల తీరాలలో పెంపొంది, కావేరీ తీరాన రూపురేఖలు దిద్దుకొని మన నృత్యకళ వికసించింది. తంజావూరు నాయక రాజులైన చెన్నప్ప, అచ్యుతప్ప, రఘునాథ, విజయరాఘవుల

కాలం మన నృత్యకళకు స్వర్ణయుగం. తంజావూరు, మధుర పాలకులు ఒకరితో, ఒకరు కలహించకుండా ఉండి యుంటే ఆంధ్రుల నృత్యకళ మహోన్నతంగా వికసించి ఉండేది.

సుమారు నలభై సంవత్సరాల క్రితం నేను నాగపూరు భండారు సంస్థానంలో కళాకారునిగా ఉండినప్పుడు భోంస్లా రాజవారి మహలులో తంజావూరు రాజవంశానికి చెందిన భోసల వంశీయులను కలుసుకొనే అదృష్టం కలిగింది. రఘూజీ మహారాజువారి అనుగ్రహంతో ఆ భోసల వంశీయులతో నేను మొదటిసారి తంజావూరు వెళ్లాను. అక్కడ రాజమహల్లో కొంత కాల ముండి సరస్వతీ పుస్తక భాండాగారంలోని గ్రంథాలను చదివి నృత్యకళను గురించి పరిశోధించాను. అంతేకాదు, మన్నారు రాజగోపాలుని ఆలయం, మేలటూరు, పూత్తుకాడు, శూలమంగళం, నల్లూరు మొదలైన భాగవత కళా కేంద్రాలను సందర్శించాను. అక్కడ కళావేత్తలను కలుసుకొని అక్కడి కళా విశేషాలను ఆకళింపు చేసుకొన్నాను. ఆ భోసల రాజ వంశీయుల ఆదరాభిమానాల వల్ల ఇటువంటి సౌకర్యాలు నాకు చాలా లభించాయి.

పందనల్లూరు ప్రత్యేకంగా భరత విద్యకు ప్రసిద్ధిగాంచింది గనుక అక్కడి నట్టువరులలో పూజ్యులు ఉత్తములు శ్రీ మీనాక్షి సుందరం పిళ్లెగారి వద్ద విద్యనభ్యసించి అనేక విషయాలను తెలుసుకొన్నాను. తంజావూరు రాజమహల్లో ఉండినందువల్ల అక్కడి నృత్యకళ గురించి ఎక్కువగా తెలుసుకొనే అవకాశం కలిగింది. నేను మధురలో ఎక్కువ కాల ముండి అక్కడి నృత్యకళ గురించి ఎక్కువగా తెలుసుకొనడానికి వీలు లేక పోయింది

తంజావూరు మహారాష్ట్ర ప్రభువుల ఆడబిడ్డను బరోడా మహారాజు పరిణయ మాడినందున ఆమెతో గూడ కొందరు నర్తకీమణులు బరోడా వెళ్లారు. అక్కడ తంజావూరు భరత కళను వారు ప్రచారం చేశారు. అందువల్ల తంజావూరు, బరోడా, నాగపూరు ప్రాంతాలను భావి పరిశోధకులు సందర్శించి, ఆంధ్ర, తమిళ

మహారాష్ట్ర ప్రాంతాలలోని భరతకళను తులనాత్మకంగా పరిశోధించవలసి ఉంటుంది.

అచ్యుతప్ప నాయకుని కాలంలో తెలుగు భాగవత కళ తంజావూరులో ప్రోత్సహింపబడింది. ఆస్థాన నృత్యకళాకారులనే గాక భాగవత కుటుంబాలవారిని గూడ అచ్యుతప్ప నాయకుడు ఆంధ్రనుండి తంజావూరుకు ఆహ్వానించి, అచ్యుతా పురంలో (మేలట్టూరులో) వారికి స్థిరనివాసం ఏర్పరచి పోషించాడు. ఆనాటి నుండి ఈనాటి వరకు అక్కడ మన తెలుగువారి భాగవత కళ సజీవంగా ఉంది. నేడు అక్కడున్న బాణీని, నేడు ఆంధ్రదేశంలో నున్న బాణీని పోల్చి పరిశీలిస్తే, పరిశోధిస్తే మన ప్రాచీన భాగవత బాణీ ఎలా ఉండేదో తెలుస్తుంది. ధ్రువా గాన రీతి పూర్వం అసలు ఎలా ఉండేదో గూడ తెలుస్తుంది. గానరీతిలోను, వాయిద. పద్ధతిలోను కాలక్రమేణా ఎటువంటి మార్పులు సంభవించాయో తెలుసుకొనవచ్చును.

అచ్యుతప్ప తరువాత తంజావూరు నేలిన రఘునాథనాయకుని కాలంలోనే ప్రముఖ పదకర్త క్షేత్రయ్య మొదటిసారి ఆయన ఆస్థానాన్ని సందర్శించాడు. కవి, పండితుడు, గాన విద్యా విశారదుడు, వైణికుడు నాట్య శాస్త్రవేత్తయిన రఘునాథ శౌరికి తెలియని శాస్త్ర విషయం లేదు. ఆయన రచించిన రామాయణం మొదలైన కావ్యాలను పరిశీలిస్తే ఆ కాలంనాటి శాస్త్రీయ నర్తన రీతులను గురించి తెలుస్తుంది. వాటిలో చాలా రీతులు నేడు మరుగున పడిపోయాయి. తంజావూరు ఆస్థానంలో నుండిన రామభద్రాంబ, మధురవాణి మొదలైన వారి రచనలలో ఆనాటి సంగీత సభలు, నృత్యకేళికలు. విద్యుత్ గోష్ఠులు వర్ణింపబడ్డాయి.

శ్రీకృష్ణదేవరాయలు కాలంనాటి రచనలలో సంగీతం, కవిత్వాల గురించే ఎక్కువగా వర్ణనలు ఉన్నాయి. నృత్యం గురించి బహు కొద్దిగానే ఉంది. శ్రీకృష్ణదేవరాయలు కాలం నాటి నృత్యకళా శిల్పం చాలా ధ్వంసమయింది. కాని తంజావూరు నాట్యం గురించి "రఘునాథాభ్యుదయ" ఇత్యాది గ్రంథాలలో వివరాలు లభిస్తున్నాయి. ఆ కాలంలో నుండిన ప్రసిద్ధ నర్తకీమణులు ఒక్కొ

క్కారు. ఒకొక్క నాట్యరీతిలో విశిష్టులైనట్లు వర్ణించబడి యుంది. ఆయన కుమారుడైన విజయరాఘవుని కాలం యక్షగానాలకు స్వర్ణయుగ మయింది. ఆయనే అనేక యక్షగానాలను రచించాడు.

అష్టభాషా ప్రవీణ రంగాజమ్మవంటి విదుషీమణు లెందరో ఈ నాయక రాజుల ఆస్థానాన్ని అలంకరించారు. వీరి కాలంలో నుండిన అనేక దేశీయ కళల గురించి గూడా వీరి గ్రంథాలనుండి తెలిసికొనడానికి వీలుంది.

"తెరుకుత్తు" అనేది ఒకటి ఆ దేశ ప్రజల కళ. ఇలాగే "కావిడిచిందు", "విల్లుపాటు" అనే కళా రీతులు ఎన్నో ఉన్నాయి.

విజయరాఘవుని కాలంలోని తంజావూరు రాజ్యం పతనమైంది. ఈయన తరువాత తంజావూరును పాలించిన రాజులు మహారాష్ట్రులు, ప్రజలు తమిళులు కాని రాజభాష తెలుగు. ఇదొక విచిత్ర సమ్మేళనం. దీనివల్లనే ఆనాటి కవిత్వ సంగీత, నృత్యాలలో అనేక ఉత్తరాది, మరాఠి సంప్రదాయాలు ప్రవేశించాయి, ఛందోరీతి నర్తనం వీరి కాలంలో ఒక కొత్త పోకడ. నాయకరాజుల కాలంలో తమిళ, తెలుగు భాషల కళా సంస్కృతుల సమ్మేళనం జరిగితే ఈ మహారాష్ట్ర రాజుల కాలంలో త్రివేణీ సంగమంలాగ తెలుగు, తమిళ, మహారాష్ట్ర సంస్కృతుల సమ్మేళనం జరిగింది.

రఘునాథుని కాలంలో ఉత్తరాది సంగీత బాణీ మన సంగీతంలో కొంత చోటు సంపాదించుకొన్నా మహారాష్ట్రుల రాజుల కాలంలోనే ఉత్తరాది, దక్షిణాది సంస్కృతులు చేరువయ్యేయి. ఈ విషయలన్నింటినీ పరిశీలించి, పరిశోధిస్తేగాని మన తెలుగు సంస్కృతీ స్వరూపాన్ని పూర్తిగా తెలుసుకొనడానికి అవకాశ ముండదు.

ఈ విధంగానే మైసూరు, ఉడిపి మొదలైన కర్నాటక ప్రదేశాలలోని నృత్యకళకు ఆంధ్రుల నృత్యకళకు గల సంబంధాలను, సారూప్యాలను, కాల క్రమేణా వచ్చిన మార్పులను పరిశోధించవలసి యుంది. ముఖ్యంగా "దేశి" ని

సాంప్రదాయక సంగీతంలో ద్రుపద బాణీకి ఒక ప్రత్యేక స్థాన ముంది. ఈ ద్రుపద బాణీనే దరువు ఆట అంటున్నారు. కేరళ, కర్నాటక, తమిళ, ఆంధ్ర ప్రాంతాలు నాలుగింటిలో ఈ సంగీత సంప్రదాయం పెంపొందింది. కృష్ణాటం, కథకళి, యక్షగానం, బయలుఆట, తెరుకూత్తు వీధినాటకం, భాగవతం మొదలైన రీతులన్నింటిలోనూ ఈ ధ్రువా గాన సంప్రదాయ ముంది గాని ప్రాంతీయ ప్రయోగ పద్ధతుల్లో మార్పు లున్నాయి. ఈ ధ్రువా గాన రీతికి మూల మెక్కడుంది ? ఇది ఏవిధంగా ప్రచారం పొందింది ? చేర్పులూ, మార్పులూ ఎలా వచ్చాయి ? పరిపూర్ణమైన "ద రు వు" ఆట ఏ ప్రాంతంలో ఉంది ? ఈ ప్రశ్నలకు సరైన సమాధానాలు దొరికితే దక్షిణాది నృత్యకళకు, ముఖ్యంగా ఆంధ్రుల నృత్యకళకు ఎంతో మేలు చేకూరుతుంది. కనుక ఈ విషయమై సరైన పరిశోధన జరగాలి.

రంభోర్వశుల నాట్య సంవాదంలో అనేక నాట్య ప్రయోగాల గురించి, తాళాలగురించి రఘునాథుడు తెలియజేశాడు. వీటి ఆధారంగా నేను కొన్నింటి పునఃసృష్టి చేయగలిగాను. నా శిష్యులలో కొందరికి వీటిని నేర్పాను గాని ఈ బాణీని వాయించగల మార్దాంగికులు నాకు తగినంత మంది దొరకడం లేదు. ఈ బాణీ నేడు ప్రచారంలో లేక చాలా కాలం మరుగుపడి యుండి నందువల్ల ఈ బాణీని మళ్లా కొత్తగా మార్దాంగికులు సాధన చేయవలసి ఉంది. ఇటువంటి పునఃసృష్టి, పరిశోధనా వ్యక్తిగతంగా సాధ్యం కావు. ప్రభుత్వ అండదండలు, తోటి కళాకారుల సహకారం అవసరం.

పరిశీలన, పరిశోధనా అనంతమైనవి. వీటివల్ల కొన్ని కళారీతులు పునః సృష్టింపబడ గలవు.

# హైందవం - ప్రకృతి ఆరాధన

ఆదిలో ఆంధ్రులు ప్రకృతినే ఆరాధిస్తూ ఉండే వారు. ఈ యారాధనలో పూజలు ఎక్కువగా ఉండేవి. పంచభూతాలనే కాక వనాలను, వృక్షాలను, పశు పక్ష్యాదులను గూడ పూజించేవారు. సృష్టిలోని ప్రతి జీవి ఆరాధనా యోగ్యమైనదిగానే ఉండేది. అదొక పరబ్రహ్మ స్వరూప ఆరాధన. ఇది విశాల భావాలు కలిగిన ఒక ధర్మంగా రూపొందింది. ఆ తర్వాత హింసాత్మకమైన మతాల ప్రచారానికి సంఘము బానిస యైంది. అటుపై సంఘాన్ని సరిదిద్దుకొనడానికి, హింసను (జంతుహింసయే గాక, తోటి మానవుణ్ణి హింసించే పద్ధతిని) అరికట్టడానికి బౌద్ధ, జైనాలు ప్రచారంలోనికి వచ్చాయి. మరల బ్రాహ్మణమతం ప్రభలింది ఆ తర్వాత శైవం వీరశైవం, వైష్ణవం, వీరవైష్ణవ మతాలు ఈ బ్రాహ్మణ మతాన్ని అనుస రించి రూపొందాయి. ఈ మతస్తులవారందరూ నృత్య పూజనుగూడా చేస్తూవచ్చారు. దీనివలన మన నృత్య, సంగీత, శిల్పాది కళలు అభివృద్ధి చెందాయి.

# బౌద్ధ మతం - అమరావతి స్థూపం

మన ఆంధ్రదేశంలో వెలిసిన మతాల్లో బౌద్ధ మతం ప్రాచీనమైంది. ఆంధ్రుల హృదయాలలో ప్రేమ వాహినులను ఇది ప్రవహింపజేసి, శాంతి సౌఖ్యాలను ప్రసాదించింది. ప్రజలు ఉత్తమ పౌరులైనారు. దేశం సుభిక్షమైంది. బుద్ధ భగవానునికి అనేక ఆరామాలు, స్థూపాలు వెలిశాయి. ఈ శిల్పకళా నిలయాలలో నృత్యపూజ ఉండేది. ఆ రోజుల్లో ఎంతటి మహత్తర మైన నృత్యకళ విలసిల్లినదో పైచిత్రాన్ని చూసి ఊహించుకొన వచ్చును. సుమారు రెండువేల సంవత్స రాల క్రిందట విలసిల్లిన ఆంధ్రుల నృత్యకళను గురించి తెలుసుకొనడానికి మనకు ఆధార గ్రంథాలు లభ్యం కాకపోయినా పాలరాతి శిల్పాలలో ఆనాటి అమర శిల్పులు సృష్టించిన సుందర నాట్య భంగిమలను ఈ చిత్రంలో చూడవచ్చును.

జపాను, చైనా, వియత్‌నామ్, కంపూచియా, థాయ్‌లాండ్, బర్మా తూర్పు దీవులలోని ప్రాచీన మత గ్రంథాలను, ఆరాధన విధానాలను మనం పరిశోధిస్తే మన దేశ నృత్యకళను గూర్చి యెంతో తెలిసికొనే అవకాశ ముంది.

# జైన మతం - మందిర శిల్పం

**అహింసా పరమో ధర్మః** అనే సత్యాన్ని చాటిచెప్పిన మతాలు బౌద్ధం, జైనం. ఈ మతాలు ఈ అహింసా ధర్మాన్ని ప్రచారం చేసినందువల్ల ప్రజలకు శాంతి, సౌఖ్యాలు లభించాయి, సుఖ సంతోషాలతో జీవించారు. ఈ మతాలవారు గూడ ఆరాధనా నృత్యాలు చేసేవారు.

అశోకుణ్ణి కళింగులు ఎదుర్కొని, కళింగ యుద్ధంలో వీర స్వర్గాన్ని అలంకరించారు. ఆ రక్తపాతాన్ని కనులార జూసిన అశోకుడు హింసా మార్గాన్ని త్యజించి, శాంతిని ప్రబోధించే బౌద్ధమతాన్ని స్వీకరించాడు. బౌద్ధమతం ఆంధ్ర దేశంనుండి వివిధ విదేశాలకు వ్యాపించింది. అమరావతి, భట్టిప్రోలు, నాగార్జున కొండ, ఘంటసాల, జగ్గయ్యపేట మొదలైనవి కొన్ని బౌద్ధమత ప్రచార కేంద్రాలుగా ఆనాడు ఉండేవి. దేశ విదేశాలనుండి ప్రజలు ఈ కేంద్రాలకు వచ్చి, బౌద్ధ మతాన్ని స్వీకరించి, విద్య నభ్యసించి వెళ్లేవారు. ఆంధ్రదేశం నుండి ప్రచారమైన ఈ బౌద్ధమతం ప్రపంచమంతటా వ్యాపించి శాతావాహన, ఇక్ష్వాక రాజుల నాటికే ఆంధ్రలో అంతరించి పోయింది. ఈ బౌద్ధమతంతోబాటు అభివృద్ధి పొందుతూ వచ్చిన జైనం కాకతీయ రాజులనాటి వరకు విశేష ప్రచారం పొందింది.

మన నృత్య సంగీతాది కళల అభివృద్ధికి బౌద్ధ, జైన మతాలు ఎంతో దోహదం చేశాయి.

కర్నాటక ప్రాంతంలోను, కొన్ని దక్షిణాది ప్రాంతాలలోను, గుజరాతు, మార్వారు ప్రాంతంలోను జైన మతం నేటికీ ఇంకా మిగిలియుంది. ఆంధ్రదేశంలో ఒక్కే ఒక ప్రసిద్ధ ప్రాచీన జైన మందిరం కొలనుపాకలో ఉంది. ఇది ఆలేరు స్టేషనుకు దగ్గరలో ఉంది మెదక్ జిల్లాలోని "జోగిపేట" - పూర్వం జోగుల ఊరట - అందులో జైన బస్తి లుండినవి.

# శైవం - వీర శైవం

బౌద్ధ, జైన మతాలు క్షీణించిన తర్వాత ఆంధ్రలో వీర శైవం విశేష ప్రచారం పొందింది. శివుడు నర్తన ప్రియుడు గనుక ఇతర పూజలతో పాటు నృత్యపూజతో గూడ ఈ మతస్తులు శివుణ్ణి ఆరాధించేవారు. ప్రతి శివాలయంలోను నృత్యం ఆరాధనా క్రమంలో ఒక భాగంగా ఉండేది. ఈ నృత్యం అనేక రీతుల్లో ఉండేది. అనేక రకాలైన వాయిద్యాలను ఈ నృత్య ప్రదర్శనలలో వాయించే వారు. నృత్యపూజ లేని శివాలయం పూర్వ ముండేది కాదు. అందువల్ల ఆంధ్రలో అనేక రకాలైన నృత్యాలు అభివృద్ధి చెందాయి. వీర శైవము ఉద్రృతమైన, ఆవేశ పూరితమైన మతం, అందు పశుపతి సంప్రదాయాన్ని విశేషించి యుద్ధమతంగా పేర్కొనవచ్చును. ఆ కాలంలో అది కావలసి వచ్చింది. శైవ సంప్రదాయం ప్రశాంతమైన, ప్రసన్నమైనట్టి రీతి గలది.

# వీర వైష్ణవం

ప్రకృతి ఆరాధన, బౌద్ధం, జైనం, వీరశైవం, శైవమతాల తర్వాత ఆంధ్రదేశంలో బహుళ ప్రచారం పొందిన మతం వీరవైష్ణవం. ఈ మతావలంబకులు నరసింహస్వామి ఆలయాలను ఎక్కువగా నిర్మించారు. ఈ యాలయా లన్నింటిలోను నృత్యపూజ ఉండేది. కౌతాలు, కైవారాలు మొదలైన వెన్నో ఈ దేవునిపైని రచింపబడ్డాయి. వాటికి నృత్త, నృత్యాలను ప్రదర్శించేవారు. "గరుడాచలం యక్షగానం" లేక "చెంచులక్ష్మి నాటకం" వీటిలో ప్రసిద్ధిగాంచింది. ఈ మతంలోని శాఖలుగా వైష్ణవం, కృష్ణభక్తి, మధురభక్తి విలసిల్లాయి. మాధవునికి, కేశవునికి, విష్ణువుకు, భావన్నారాయణునికి, చెన్నకేశవునికి, ఈ మతావలంబకులు, ఆలయాలు నిర్మించారు. శివభక్తులు శంకరాచార్యుని ప్రవక్తగా పూజిస్తున్నట్లు - వీరు రామానుజాచార్యుని ప్రవక్తగా పూజిస్తారు.

# కృష్ణ భక్తి - మధుర భక్తి

రాధా మాధవులను ప్రేమమూర్తులుగా ఆంధ్రులు ఆరాధిస్తారు. కృష్ణుడు సంగీతప్రియుడు, వేణుగానలోలుడు, ప్రేమతత్వానికి ఆరాధ్యదైవం. ఇతడు దక్షిణ నాయకుడు. రాధ ప్రేమమూర్తి. ఈ రాధాకృష్ణులు లేనిదే మన నృత్యకళ ఇంత శృంగార వంతంగా అభివృద్ధి చెందేది కాదు. ఈ యిరువురి మధుర భావాలే మన నృత్య సంగీతాలకు మూలమైనవి. ఒక ప్రత్యేక కళగా మన అభినయకళ ఈ కృష్ణుని ఆరాధనలోనే రూపొందింది.

వల్లభాచార్యుడు తెలుగువాడు. కోనసీమకు చెందిన కృష్ణభక్తుడు. ఇతడు రాజస్థాన్ ప్రాంతానికి వెళ్లి కృష్ణభక్తిని, రాధాకృష్ణుల ప్రేమతత్వాన్ని బోధించాడు, ప్రచారం చేశాడు.

# నాట్య మేళం

అనాదినుండి ఆంధ్రుల నృత్యకళ రెండు విధాలుగా రూపొందుతూ వచ్చింది. ఒకటి నట్టువ మేళ సంప్రదాయం, రెండవది నాట్య మేళ సంప్రదాయం.

స్త్రీలు చేసే నాట్యాన్ని నట్టువ మేళం అన్నారు. పురుషులు చేసే నృత్య నాటకాలను నాట్యమేళం అన్నారు.

ప్రాచీన కాలంలో నాట్యమేళాలకు ఉపయోగించిన వాయిద్యాలను, వాయిద్యకులను, వారి ఆహార్యాన్ని, వేషధారణను ఈ చిత్రంలో చూడవచ్చును.

నట్టువ మేళ విద్యను కొన్ని తెగలవారు మాత్రం ఆరాధించేవారు. నాట్య మేళ రీతి అట్లుగాక సంఘానికి అట్టడుగున వున్న బీదవారు మొదలుకొని, సంఘంలోని ఉన్నత తరగతులకు, కులాలకు చెందిన పురుషులు వరకు ఈ కళను అభ్యసించి వీధి నాటకాలు, భాగవతాలు, యక్షగానాలు ఆడారు.





## దేవ నర్తకి

ఆలయంలో తూర్పుదిక్కున ధ్వజ స్థంభ ముంటుంది. ఇదే ఇంద్రస్థానం. ఆలయ నర్తనాలలో ఇంద్రుని కొరకు ఒక ప్రత్యేక నర్తనాన్ని దేవనర్తకి ప్రదర్శించేది. ఒక నర్తకి కుంభహారతి నిచ్చేది. నట్టువరాలు తాళం వేసేది ఇదే నట్టువ మేళం.

ఇంద్రుడు, అగ్ని, యముడు, నైఋతి, వాయువు, వరుణ, కుబేరుడు, ఈశాన్యులనే ఈ అష్ట దిక్పాలుర ప్రీతి కొరకు ఎనిమిది విభిన్న రాగాలలో గద్యాలను పఠించి, తాళం వాయిస్తూ నృత్యం చేయడం పూర్వం ఆచారంగా ఉండేది.

పై చిత్రం ఆలయ సంప్రదాయంలోని ఒక నృత్య భంగిమ.



## రాజ నర్తకి

స్త్రీ నర్తకులు ప్రదర్శించిన నట్టువ మేళ నృత్యకళ ఆగమ రీతిని, ఆస్థాన కేళికా రీతిని, నవజనార్ధన పారిజాత రీతిని మూడు విధాలుగా రూపొందింది. ఆలయ మూర్తి సమక్షంలోను, రాజాస్థానంలోను, పండిత సభల్లోను, ప్రదర్శింపబడిన శాస్త్రీయ ఏకపాత్ర నృత్య విద్వత్ప్రదర్శనను కర్నాటకమని, కచ్చేరీ ఆట అని, దర్బారు ఆట అని, కేళిక అని అనేవారు.

ఒకే నర్తకి తనకు నృత్త, నృత్య, అభినయాలలో గల పాండిత్యాన్ని ప్రజ్ఞాపాటవాలను ప్రదర్శిస్తూ కేళిక చేసేది. నృత్యపూజగా దేవుని యెదుట ప్రదర్శించే కేళికను దర్బారు ఆట అన్నారు. రాజుల కచ్చేరీలలో ప్రదర్శించే నృత్యాన్ని కచ్చేరీ ఆట అన్నారు. దీనిని కర్నాటక సంగీత సంప్రదాయాను సారం ప్రదర్శిస్తారు గనుక దీనిని కర్నాటకం అనిగూడా అన్నారు. దీనినే నేడు మనం "ఆంధ్రనాట్యం" అంటున్నాం.

శాతవాహన రాజుల కాలంనుండే, ఇక్ష్వాకులు, బృహత్పలాయనులు, విష్ణుకుండినులు, చోళులు, పల్లవులు, కాకతీయులు, విజయనగర సంస్థానాధీశులు, తంజావూరు మధుర నాయక రాజు లందరూ ఈ కళను పోషించారు.

ఆంధ్రుల సాంఘిక, సాంస్కృతిక చరిత్రను తెలిసికోవాలంటే మన్రో మెకంజీ దొర కైఫీయతులు చదవాలి. అట్లే గిరిజనుల గూర్చి, ముఖ్యంగా వింధ్య పర్వతాలకు దక్షిణంగా వున్న ప్రాంతాల అడవులలోని తెగల వారి, సంస్కృతి, సాంఘిక ఆచారాలు, నృత్యకళలను గూర్చి తెలిసికోవాలంటే "వారియర్ ఎల్విన్" అనే విదేశీయుని రచనలు చదవాలి.

అలాగే మన దేశ ప్రజల గురించి పూర్తిగా తెలిసికోవాలంటే "Castes and Tribes" అన్న గ్రంథాలన్నీ చదవాలి. వీటిని చదివితే భారతదేశ మత, సాంఘిక ఆర్థిక, సాంస్కృతిక, రాజకీయ చరిత్రను తెలిసికొనగలము.

# పార్వతీదేవి ప్రదర్శించిన
## పంచతాండవ నర్తనాలు

ఆనంద తాండవం, సంధ్యా తాండవం, కలిక (కాళిక) తాండవం, విజయ తాండవం, ఊర్ధ్వ తాండవం, ఉమా తాండవం, సంహార తాండవం అనే సప్త తాండవాలను పరమ శివుడు చేసినట్లు మనకు శాస్త్ర గ్రంథాలలో కనబడుతుంది. ఈ తాండవ వర్ణనలు గల పాటలు, జతులు అనేక మున్నాయి. ఇలాగే శుద్ధ, దేశి, పేరిణి, ప్రేంఖన, దండిక, కుండలి, కలశ అనే ఏడు విధాలైనా పరమ శివుని నర్తనాలైన దేశినీ తాండవాల గురించి గూడా మనకు శాస్త్ర గ్రంథాలలో వివరాలు లభ్యమౌతున్నాయి. ఈ నర్తనాలను ప్రత్యేకంగా ఆలయాలలో పూజా సమయంలో ప్రదర్శించేవారు కాని, పార్వతీదేవి ప్రదర్శించిన పంచ తాండవాల గురించి కొద్దిగా తప్ప పూర్తిగా ఏ గ్రంథంలోను కనబడడం లేదు.

శివుడు తాండవాన్ని ప్రదర్శించినట్టు పార్వతీదేవి లాస్యాన్ని ప్రదర్శించి నట్టు నాట్యశాస్త్ర గ్రంథాలలో సామాన్యంగా కనబడుతుంది. మరయితే పార్వతీ దేవి పంచతాండవాలు చేయడమేమిటి ? ఆమె లాస్యాన్నే గదా ప్రదర్శించింది అని చాలా మంది కళాకారులకు ఒక సందేహం కలగవచ్చును

ఈ పార్వతీదేవి పంచ తాండవాల గురించి నందికేశుడు తన భరతార్ణవంలో కొద్దిగా వివరించాడు. ఈ వివరణను అనుసరించి మన ప్రాచీన నాట్య శాస్త్రవేత్తలు ఆ నర్తనాలను సంపూర్ణంగా రూపొందించారు.

భరత రీతి రెండు విధాలైనది. ఒక సంప్రదాయానుసారం పురుషులు ప్రదర్శించేది తాండవం, స్త్రీలు ప్రదర్శించేది లాస్యం. వేరొక సంప్రదాయానుసారం నర్తకులు కూర్చొని అభినయించడం లాస్యం. నిలబడి తాళ లయల ననుసరించి నర్త మాడడం తాండవం. ఈ రెండవ సంప్రదాయాన్ని అనుసరించి రూపొందినవే ఈ పార్వతీదేవి పంచ విధ తాండవాలు. ఇవి అంతగా



## 2. కుంచితం

ఒక గురువు, రెండు లఘువులు, ఒక గురువు గల చాచపుట తాళంతో ఈ తాండవం ప్రారంభమౌతుంది. తర్వాత హంసినీగతిలో సౌందర కరణాలు విచ్యవాచారీ విన్యాసాలు రెండు లఘువులు, ఒక విరామం గల హంసలీలా తాళంలో ప్రదర్శింపబడతాయి. ఈ సౌందర కరణాన్ని, విచ్యవాచారీని మళ్లా ప్రదర్శించి ముగించాలి.



## 3. ఆకుంచిత

నాలుగు ద్రుతాలు, ఒక గురువు గల రంగతాళంలో ఈ తాండవం ప్రారంభమౌతుంది. ఒక లఘువు, రెండు గురువులు, ఒక లఘువు, ఒక గురువు గల సింహనాద తాళంలో హరిణీగతిలో వారుణ కరణాలు ప్రదర్శింప బడతాయి. తర్వాత అడ్డిత చారీతో ఈ తాండవం ముగుస్తుంది.



## 4. పార్శ్వ కుంచిత

ఒక గురువు, నాలుగు ద్రుతాలు, ఒక గురువు గల బిందుమాలి తాళంతో ఈ తాండవం ప్రారంభమౌతుంది. తర్వాత నాలుగు లఘువులు, ఒక విరామం గల కరణీ గతి గజతాళంలో విన్యాసాలు ప్రదర్శింపబడి గజ విక్రీడిత కరణంతో ముగుస్తుంది.



## 5. అర్ధ కుంచిత

ఒక గురువు, ఒక లఘువు, ఒక ప్లుతం గల కోకిల ప్రియ తాళంలో ఈ తాండవం ప్రారంభమౌతుంది. తర్వాత చంద్ర కరణాలు సారికా గతిలో ప్రదర్శింపబడతాయి. ఆ తర్వాత ఒక లఘువు, రెండు గురువులు గల కందర్ప తాళంలో శకటాస్య చారి ప్రదర్శనతో ముగించబడుతుంది.

పైని పేర్కొన్న నాట్యాలను నెల్లూరు జొన్నవాడ కామాక్షమ్మ, కాళహస్తి జ్ఞానప్రసూనాంబ, చెయ్యూరు సుందరేశ్వర ఆలయాల్లో దేవనర్తకులు చేయగా చూసే భాగ్యం నాకు కలిగింది. వీటిని గురించి నేను పరిశోధించి పై విషయాలను వ్రాయగలిగాను. వీటిని నా శిష్యులలో కొందరికి నేర్పాను.

## శబ్దాల కూర్పు

ఈ పంచ విధ తాండవాలకు తాళాల శబ్ద కూర్పు ఒక విశేషమైనది. ఈ శబ్దాలు ధ్వని ప్రాధాన్యతతో కూర్చబడ్డాయి. ఈ శబ్దాల కూర్పు ఆ తాళ స్వభావాన్ని తెలియ జేస్తుంది. సింహతాళంలో ప్రదర్శింపబడే హరిణీ గతిని ఉదాహరణగా తీసుకొందాం.

కూర్మాసన స్థానకంలో నిలబడి, రెండు చేతులతో అర్ధ పతకాలను ప్రదర్శించడంతో ఈ హరిణీ గతి విన్యాసం ప్రారంభమౌతుంది. దికగుణ । తకణకు । తదిక కిణ్ణత - కిటకిణ । కృజణతరి కృతోం - తత్త తగు తరి తరి తరి కృతా ॥ అనే శబ్దాల కట్టుబాటుతో సింహనాద తాళాన్ని మృదంగం పైని వాయించేటప్పుడు హరిణీ గతిని ప్రదర్శించడానికి అనువుగా ఉంటుంది.

ఈ విధంగానే ఇతర నాలుగు తాండవాలను ప్రదర్శించడానికి అనువైన మృదంగ శబ్దాలు తాళాలకు తగినట్టుగా కూర్చబడ్డాయి.